136
మార్చ్
1992

# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక



నా కోయతూర్‌ను పోలీస్ హోక్తోర్
మా ఆదివాసీర్‌ను హోక్సెరె మంతోర్
మాట్ సంగం పండ్తోయ్
అదే కసూర్ ఆతేకి
అద్ కసుర్ కీయాల నన్నై పేకెగుచ్చోన్
హాకిర్ హూడిక్కన్
హా త్తెకి పేకుర్ మంతోర్....

నా భర్తను పోలీసులు హత్యచేశారు
మా ఆదివాసీలను హత్యచేస్తున్నారు
మేం సంగం పెట్టినం
అదే తప్పయితే
ఆ తప్పు చేయటానికి వెనుకాడను
చంపనీయండి చూద్దాం
నేచస్తే....నా పిల్లలున్నారు....




# విషయసూచిక



---

'అరుణతార'కు రచనలు, చందాలు

పంపవలసిన చిరునామా


వి. చెంచయ్య

6-5-13, కావలి

నెల్లూరు జిల్లా - 524 201

422/800

# ఎత్తుపల్లాలు

సమాజమా వ్రాసుకో ఈ శాసనాన్ని, సాహిత్యమా ఉంచుకో ఈ సంవాదాన్ని
భూగోళమే ఒక గానుగైపోయింది, మనిషి బతకడమే గారడయిపోయింది
చట్టాలు శాసనాలు సాంప్రదాయాలు బాధలు భారాలు మోసి మోసి తల నెరసి పోయింది
గొడుగు నీడన బతికామొ ! పడగ నీడన బతికామొ ! !
సుడిగాలులు మాత్రం వెన్నంటే వున్నాయి
వేటాడే క్రూరమృగ పంజాలా, వెంటాడిన ఘోరమైన బతుకు
వెనక్కి తిరిగి చూస్తే అంతా అంధకారమే !
ఆకాశంనుండి పచ్చని గొలుసులు, ఇన్నాళ్ళూ మన్ను అల్లుకున్నాయి
ఈ రోజు మానవుడు ఎగరగలుగుతున్నాడు
గెలాక్సీలో స్వర్గం మాట అటుంచి, భూమిపై నరకముందని నమ్ముతున్నాము
అదిగో అటు చూడు రిక్షావాలాను ! పెట్రోలు యంత్రం కొనే శక్తి లేదు
ఒంట్లో రక్తాన్నే పెట్రోలుగా వాడుతున్నాడు
పడిపోయిన రూపాయి విలువ లోయలో జారిపోతున్నాడు
దెబ్బమీద దెబ్బ వేస్తూ ధనవంతుడే ఇంకా గెలుస్తున్నాడు
రాజులు, గుర్రాలు వదలి కార్లలోకి మారినా, రైతుల జీవితాలలో మార్పులేదు
పాతయుగాల కత్తులు మ్యూజియాల్లోకెళ్ళి
ఆధునిక ఆయుధాలొచ్చినా.... మనిషి ఇంకా పీడితుడే
శిరచ్ఛేదం ఉరిశిక్షగా మారితేనేమి, ఉరిశిక్ష లాకప్ హత్యగా మారితేనేమి
లాకప్ హత్య ఎన్‌కౌంటర్‌గా పరిణమిస్తేనేమి
ఆక్టోపస్ జీవిని ఏ చేతితోనైనా తినగలదు
వేటగాడు ఏ సాధనంతోనైనా శికారి చేయగలడు
దొంగలింతకు శ్రమదోపిడికీ తేడా ఏమిటి ?
సంకెళ్ళకూ సాంప్రదాయానికీ తేడా ఏమిటి ?
మతబోధకూ మోసగింతకూ తేడా ఏమిటి ?
సాలెపురుగు వలను ఎంతో అందంగా అల్లగలదు
జాలరి చేపల్ని ఏ వ్యూహంతో నయినా పట్టగలడు

అదిగో అటుచూడు స్త్రీని, చీర విప్పితేతప్ప ఆకలి చల్లార్చుకోలేని దౌర్భాగ్యం
నాడు అంగట్లో రతనాలు అమ్మారట!
అదెవ్వడు చూసాడుకానీ - నేడు బజారులో స్త్రీ అంగాలు భంగిమలుగా
వ్యాపారానికి ఉపయోగపడుతున్నాయి
పైగంబరులు ఎందరోవచ్చి చూసిపోయారు
దిగంబర కరాళనృత్యం సాగుతూనే వుంది
సాంఘిక ధర్మమా! ఆపు నీ లైంగిక దోపిడిని!
అటు చూశావా! మీసాల ఆసామిని! బంగారు పళ్ళతో వెకిలిగా నవ్వుతున్నాడు
రోగార్తుని కడపటి శ్రమను సైతం జుర్రుకోవాలని
వక్కలా ఆ చూపులు! వీడే పొద్దంతా గాంధీ బోధనలు చేస్తాడు!
రాత్రి పడగానే సానికొంపల్లో మునిగితేలుతాడు
ప్రతీ దినపత్రికలో వీడి ఆదర్శాలే ముందుంచబడతాయి!
రక్తం పీల్చే రాక్షస సమాజంలో, బుద్ధుడి ప్రతిమ ఎంత పెద్దదైతేనేమి?
స్త్రీ మానం, ప్రాణం లాకప్‌లో దోచబడుతుంటే
స్త్రీలకు రాజనీతిలో రిజర్వేషన్ కల్పిస్తేనేమి!
స్త్రీలందరూ స్త్రీలు కారు
ఆకలిబాధ భరించలేక అన్నీ కోల్పోయేది స్త్రీలు
చిరిగిన దుస్తులతో, .... చింపిరి జుత్తుతో భిక్షం ఎత్తుకునేది స్త్రీలు
వరకట్నం ఇచ్చుకోలేక కిరసనాయిల్ మంటకు గురిచేయబడేది స్త్రీలు
పసివయస్సులో పెళ్ళిచేయబడి, గర్భంతో సచ్చేది స్త్రీలు
బ్రాహ్మణ విషసంస్కృతి చట్రంలో బానిసలుగా బతుకీడుస్తున్నది స్త్రీలు
స్త్రీలంటే వీళ్ళు .... మరోవైపు స్త్రీలు-
అందాల కిరీటం! అందాల పోటీలో అందుకుంటేనేమి
అంతర్జాతీయ ఆటల్లో స్త్రీలు పరుగుపందెంలో గెలిస్తేనేమి
ఐదునక్షత్రాల హోటల్లో ఎంజాయిగా గంజాయిదమ్ము గుంజితేనేమి
డబ్బున్న ఆడది అర్ధరాత్రి కారులో ఒంటరిగా తిరిగి
గాంధీగారి స్వాతంత్ర్యాన్ని నిలబెట్టగలదు!
ఎన్నేళ్ళని ఈ అట్టడుగు జనాల్ని కాళ్ళకింద తొక్కిపట్టి
నిటారుగా నిలబడే ఓ అర్థికరంగమా!
అడుగుజనం అగ్ని అయితే,....నీవే భగ్నమవుతావ్.

—యొన్నం సత్యం

# గోదావరిలా ప్రవహించు చెల్లీ !

చెల్లీ
శ్రీకాకుళ పోరాటాల నుండి పొరలు పొరలుగా పురివిప్పుతూ
ఎదుగుతున్న ఎర్రమందారాలు మీరు
పుష్పగుచ్ఛాల్లో పుట్టిన పిండిరేణువుల పుట్టలు మీరు
నగ్జల్బరీ పోరాట తమ్ముళ్ళను మీ గుండెల్లో దాచుకొనే మందారాలు మీరు
నిర్బంధ కారుమేఘాల్నుంచి పెరుగుతున్న పోరాటాలకు లేతాకులు మీరు
చెట్టయి, పువ్వయి, కాయయి, పండుపండి ప్రజల గుండెల్లో పేర్లు రాసుకొనే దాకా

ఎర్రమందారాలను మీ గుండెల్లో దాచుకోండి
మీ రక్తపు నరాల్లో జీర్ణించుకొనేలా ఇంజక్టు చేయండి
చెల్లీ
గోదావరిలా ప్రవహించే నీ నెత్తురును
ఎర్రజెండాకు అంకితం చెయ్

—యం. నిరంజన్

# బొంగ్లేతు ప్రాంత తల్లుల కోసం

బొంగ్లేతు ప్రాంత తల్లులకు బిడ్డల పోరాటాలు కొత్త కాదు
బొంగ్లేతు ప్రాంత తల్లులకు బిడ్డల మరణాలూ కొత్త కాదు
బొంగ్లేతు ప్రాంత తల్లులకు త్యాగాలు కొత్త కాదు
శవాల గుట్టలపై నిలబడి
అంతా అణచివేశానని శత్రువు ఉప్పొంగిపోతున్నాడు
కానీ
వీరుల మరణాలకు మేం కన్నీరు కార్చం, విచారపడం
బొంగ్లేతు ప్రాంత తల్లులు ప్రజల్ని సమీకరిస్తారు
తమ బిడ్డల మరణాలకు ప్రతీకారం తీర్చుకొంటారు

తమ బిడ్డలతో పాటు సాయుధులై, ఆఫ్రికా విముక్తి సైనికులై
పురవీధుల్లో కదం తొక్కుతారు
ఆ రోజు కోసం సన్నద్ధంగా వుంటాం
ఆ రోజు కోసం సాయుధమై వుంటాం
అమరవీరుల ప్రతి మరణానికి
ప్రతీకారం తీర్చుకోడానికి సర్వసన్నద్ధంగా వుంటాం
బొంగ్లేతు ప్రాంత తల్లులు దుఃఖపడరు, నిరాశపడరు
తమ బిడ్డలు చిందించిన నెత్తుటి నుండి
పోరాట స్ఫూర్తిని ఆవాహనం చేసుకొంటారు
తమ రక్తాన్ని బొట్లు బొట్లుగా ధారబోసి
తమ విముక్తి వృక్షాన్ని పెంచుకొంటారు

[పేరు తెలియని ఆఫ్రికా స్కూలు విద్యార్థి వ్రాసిన "మదర్స్ ఆఫ్ బొంగ్లేతు
ఆఫ్రికా కవితకు స్వేచ్ఛానువాదం] —మౌనిక్

# కా॥ జ్యోతి స్మృతిలో...

రణం బిడ్డ! పోరు బిడ్డ! త్యాగాల ముద్దు బిడ్డ
అమరవీరుల ఆశయాన్ని ఆయుధంగా చేపట్టిన ఆడబిడ్డ
పీడల బాధల బతుకు పోరులో, అణచబడ్డ అక్కల ఆక్రందనలో
అరుణ కిరణ క్రాంతివై, సాయుధ సమర హోరు నినాదానివై
'భూ' పోరుతో సాగించిన వర్గపోరులో నింగి కెగిసిన నీ పేరు చూసి
విలువెల్లా విషం నింపుకున్న కసాయి కాలనాగులు
చీకటి చాటున మాటుగాసి, కాటువేసి
"జ్యోతి" ఆరిపోయిందని, కాళరాత్రి కసితో బుసలు కొడ్తున్న
విషనాగుల కోరలు పెరికి వేయడానికి
పల్లెల్లో 'జ్యోతి' ప్రతిరూపాలు
వెలుగులు విరజిమ్ముతూ, ఎర్రదండు అండతో
నేడు-మును ముందుకు దూసు కొస్తున్నాయ్

—నేస్తం

కథ :

# పోలమ్మ

—ఖాను

రోజులాగే ఆ రోజూ తెల్లారింది. సూరీడొచ్చాడు. వెలుగొచ్చింది. కానీ ఆ వెలుగు పోలమ్మను చేరలేదు. వెలుగు రాకముందే లేచి గబగబా తెవిలి అమ్మగార్ల ఇళ్ళకి పాచిపనికి పరుగెత్తే పోలమ్మ ఆ రోజు వెలుగొచ్చిన గంటదాకా మెలుకువ లోకి రాలేదు కళ్ళు తెరవగానే అప్పటి వరకూ గాలితో, వెలుగుతో కడుపు నింపు కొంటున్న పిల్లాడు పరుగెత్తుకొంటూ వచ్చి పక్కన జేరాడు. అప్పటి వరకూ తల్లిని లేపి లేపి విసుగొచ్చి పన్లోకి పోయిన తండ్రి వైనం జెప్పి "అమ్మా, బువ్వెట్టే" అని దీనంగా జూసాడు.

'ఊఁ....' అంటూ మూలిగి లేవబోయిన పోలమ్మ అంగుళం కూడా శరీరం కదల్చలేకపోయింది. కాళ్ళూ, సేతులూ సచ్చుబడిపోయినట్లున్నయ్ "రాత్తిరి వాడు కొట్టిన దెబ్బలకి నడుం ఇరిగినట్టుంది. మూడు రోజుల్నుండి వరస ఒకటే దెబ్బలు. ఎదవ బతుకు, సచ్చినా బాగుండిపోను" అనుకుంటూ కొడుకు వేపు సూస్తూ పెదాలు కదిల్చింది. కానీ మాట పెకల్లేదు.

తల్లి పరిస్థితి చూసి దిగులుగా ఆలోచిస్తూ కూచున్నాడు సింహాచలం. "ఎవుల్ని పిలిద్దామన్నా అందరూ పన్లోకి పోయిరి. ఆకలేత్తాంది. అమ్మకేవోఁ బావో లేదు. ఈ అయ్యెప్పుడూ ఇంతే. తాగిరావడం, అమ్మను తన్నడం. పాపం! అమ్మ అందరిళ్ళల్లో సచ్చే చాకిరి చేసి డబ్బులు తెత్తాది. అయ్యొచ్చేప్పటికి అన్నం ఒండు తాది. అయినా అయ్యకి కోపవేఁ, తాగొచ్చి అదొండలేదు, ఇదొండలేదు అని తంతాడు. అప్పుడు అయ్యను సూత్తే ఎంత బయమేత్తుందో! అమ్మకూడా కోపంతో అరుత్తుంది గానీ, కొట్టదుగందా! ఎందుకు కొట్టదో?"

"ఒరే, సింవాచలమాఁ కూసిని నీళ్ళియ్యరా" తల్లి పిలుపుకి లేచివెళ్ళి నీళ్ళు ఇచ్చాడు. ఆ గ్లాసు చేత్తో పట్టుకోలేక, అద్నే గొంతులో పొయ్యమంది.

ఇప్పటికి ఆరేళ్ళుగా, ఇలా దెబ్బలు తినడం శరీరానికీ, మొగుడి నిరాదరణ మనసుకీ అలవాటై పోయాయి. అసలే మగవాణ్ని, మొగుణ్ని అన్న అహంకార

ముంది పరదేశికి. ఆర్థిక బాధలు భరించలేక ఎప్పుడైనా తాగేవాడు. ఇక ఈ మధ్య ఈ పేటలోకే ప్రభుత్వ సారా దుకాణం వచ్చేటప్పటికి తాగడం, తన్నడం, రోజువారీ కార్యక్రమాలైనాయి. ఎక్కువగా తన్నులు తిన్నప్పుడు వొళ్లు సలపడం, జ్వరం రావటం జరిగేది. కానీ ఈసారి ఎందుకో పోలమ్మకు భయమేసింది. ఎప్పట్లా అని పించలేదు. శరీరంలో ఏ భాగమూ కదలటం లేదు.

నెమ్మదిగా పన్ల నుండి ఒక్కొక్కరూ రాసాగారు. పక్కింటి అప్పాయమ్మ రాగానే సింహాచలం పరుగెత్తుకెళ్ళి పిలుచుకొచ్చాడు. పోలమ్మ పరిస్థితి చూసి భయ పడిన అప్పాయమ్మ నలుగురినీ కేకేసి ఆస్పత్రికి తీసుకెళ్ళింది.

డాక్టరు చూసాడు. ఏపుందీ, దెబ్బలు తినీ, తినీ శరీరంలో నరాలు పట్టు తప్పాయన్నాడు. బలమైన తిండి తిని, మంచి మందులు వాడాలన్నాడు. ఇంక ఏ పనీ చెయ్యలేదన్నాడు. రెస్టు తీసుకోవాలన్నాడు. ఈ దేశంలో 'పోలమ్మ'కి సాధ్యం కానివి చాలా చెప్పాడు. విన్న పోలమ్మకి మనసు కూడా పట్టు తప్పింది.

తల్లొచ్చి గోలు గోలున ఏడుస్తూ కూతుర్నీ, మనవడినీ తీసుకుపోయింది.

భద్రతలేని జీవితం, విపరీతమైన శ్రమ, చాలీ చాలని అవసరాలు పరదేశికి నిర్లక్ష్యాన్నీ, అరాచకాన్నీ, అసంతృప్తినీ, కసినీ రగిలిస్తే, బతుకులోని మెరటుతనం మెదడును మొద్దుబార్చితే, మగాడినన్న అహంకారం, 'ప్రభుత్వ సార' ప్రోత్సాహం ఆ కసిని పోలమ్మపై తీర్చుకోవడానికి దోహదం చేసాయి. పెళ్ళామే కదా అందరి కంటే లోకువ.

కూతురు కాస్త లేచి తిరగటం మొదలెట్టాక వెంటబెట్టుకొని అల్లుడి దగ్గరకు వచ్చింది పోలమ్మ తల్లి. అప్పటికే ఎప్పట్నుంచో సంబంధం వున్న కాసులమ్మను తెచ్చి ఇంట్లో పెట్టుకున్నాడు అల్లుడు. అదేమంటే "ఏం జేసుకోవాలి నీ కూతుర్ని, కూసోబెట్టి మేపడం తప్ప. పన్లోకెల్లలేదు. ఇంట్లో పన్లు సరిగా చేయలేదు. ఇంత ఓపికలేని దాంతో నేనుమాత్తరం సంసారం ఎట్టా జెయ్యాల? నువ్వే తీసుకపో" అని కసిరాడు.

"నీ జిమ్మడ, ఒంట్లో ఓపికున్నంత వరకూ సాకిరీ జేయించుకున్నావ్, ఇప్పు డేవో వద్దంటావా? అదట్టా అవ్వడానికి నువ్వే గదరా కారణం! నీ సంపాదనంతా తాగుడికి పోతే అదే కదరా సంసారం నడిపింది. ఇప్పుడు వొద్దంటే యాడికి పోద్ది,

ఎట్టా బతుకుతాది? దాని ఒల్లు గుల్లజేసి ఇప్పుడు పొమ్మంటావా?" అని తిట్టి పోసింది.

"అదంతా నాకు తెల్దే, దాన్ని నేను పోసించలేను. అది పల్లో కెల్ల లేదు. ఇంకెందుకు ఇక్కడ" అన్నాడు పరదేశి.

ఈ గొడవకి అక్కడ జేరిన ఆడవాళ్ళంతా విరుచుకపడి పరదేశిని నానా మాటలా అన్నారు. నువ్వు మడిసివి కాదన్నారు. ఆ పేటలో తాగొచ్చి పెళ్ళాల్ని తన్నే మగాళ్ళందర్నీ తిట్టారు. ఆ సారాషాపు పెట్టినోడ్ని తిట్టారు. పర్మిటిచ్చిన గవర్నమెంటును తిట్టారు. ఆ సారాషాపు లేపేయాలన్నారు. ఇంక ఆ పేటలో పెళ్ళాల్ని ఎవరు కొట్టినా వూరుకోకూడదన్నారు. అందరూ కల్సి ఆ ధౌర్జన్యాన్ని ఎదుర్కోవాలన్నారు. ఇన్నాళ్ళుగా వారిలో పేరుకుపోయిన ఆవేదన, ఆక్రోశం, ఆగ్రహం పరిష్కారం వైపు పయనిస్తున్నాయి.

భౌతికంగా పోలమ్మను కొట్టి నిస్సహాయిరాల్ని చేసింది పరదేశి అయినా, ఆ పరదేశీ ద్వారా పోలమ్మ జీవితాన్ని చావుదెబ్బ తీసింది వేళ్ళూనుకుపోయిన ఈ పితృస్వామికసమాజం, దోపిడీ ప్రభుత్వాలేనని గుర్తించారు. ఈ దేశంలో 'పోలమ్మ'ల జీవితాలు బాగుపడాలంటే ఆ వేళ్ళను తుదకంటా పెకలించి, కొత్త విత్తనాలు నాటాల్సిందేనని ప్రతిన బూనారు.

# ఈ రాత్రే

నిజమే, ఈ రాత్రి
కాలం క్షణకాలంపాటు స్తంభించిన రాత్రి
పౌరహక్కుల తల్లిని తార్చాలనుకొన్న రాత్రి
మానవత్వపు చెల్లిని రమించాలని తెగించిన రాత్రి
కానీ,
ఈ రాత్రే చప్పని గుండెల్లో సైతం
చంద్ర నిప్పు గుప్పున రాజుకొంది!

—మానస

# భారతదేశంలో మహిళా వుద్యమానికి సోపానాలు నిర్మిస్తున్న ఆదివాసీ అక్కలు

క్రాంతికారి ఆదివాసీ మహిళా సంఘటన్ గడిచిరోలి జిల్లా మహాసభ దేశ చరిత్రలోనే మొదటిసారిగా అపూర్వమైన రీతిలో జరిగిన మహాసభ! అందులోనూ మనదేశంలో అత్యధికంగా పీడింపబడుతున్న ఆదివాసీ స్త్రీలు ఆ అణచివేతను, దోపిడీని ఎదిరిస్తూ సంఘటితపడి తమ పోరాటాన్ని మరింత ముందుకు తీసుకుపోవడానికి సమావేశమవుతున్నారు!!

15 రోజుల ముందు యిలా మహాసభకు మీరు హాజరు అవుతున్నారు అని చెప్పినప్పుడు ఎంత సంతోషం కల్గిందో, అన్ని సందేహాలూ వచ్చాయి-ఆదివాసీ అక్కలు ఎలా వుంటారో, వాళ్ల భాష రాదు కదా, వాళ్ళతో ఎలా మాట్లాడాలి, వాళ్ళ మహిళా సంఘాలు ఎలా పెడుతున్నారు, ఎలా పని చేస్తున్నారు-యిలా. ఈ 15 రోజులు ఎలా గడుస్తాయా, ఎప్పుడెప్పుడు వారిని కలుస్తామా అని ఆత్రుతపడి పోయాం. మైదాన ప్రాంతాల్లో మహిళా సంఘాల్లో పనిచేస్తున్న మాకు అడవిలో మహిళా ఉద్యమాన్ని ఎలా నిర్మిస్తున్నారో తెల్సుకోవాలని ఎక్కువ ఆసక్తి వుండటం సహజం. ఆఖరికి ఆ రోజు రానే వచ్చింది.

మహాసభ స్థలానికి మేం చేరుకునేసరికే అక్కడ వివిధ రేంజిలనుండి వచ్చిన ప్రతినిధులతో కలకలలాడుతోంది. ప్రతి ఒక్కరూ నవ్వుతూ వచ్చి మాతో చేతులు కలిపి లాల్ సలాం చెప్పారు. సభ నిర్వహణ కోసం వచ్చిన దాదలు, దళంవాళ్ళు నలుగురైదుగురు తప్ప మిగతా ఎక్కడచూసినా స్త్రీలే. వంట చేసేవాళ్ళు చేస్తుంటే, కొందరు కరుకు (లేత వెదురు) నరుక్కొచ్చి వేస్తున్నారు. మరికొందరు సభాస్థలిలో రాళ్ళు లేకుండా చేసి చదును చేస్తున్నారు. ఆదివాసీ మహిళలు ఎంతో అవలీలగా గొడ్డళ్ళు పట్టుకుని చెట్లు నరుకుతుంటే, ఎంతో ఆత్మవిశ్వాసంతో అన్ని పన్లూ చేసుకుపోతుంటే ఆశ్చర్యపడుతూ చూస్తుండిపోయాం. అవును, ఆదివాసీ స్త్రీలు చేయని పనే లేదు. వ్యవసాయంలో నాగలి పట్టుకొని దున్నడం దగ్గర్నుంచి ప్రతి పనిలో వాళ్ళు పాల్గొంటారు. గొడ్డలి చేత పట్టితే ఎంతటి మాను అయినా ఒరిగి

రావాల్సిందే. చూస్తుండగానే కరుకు తయారుచేసేశారు. వుత్పత్తిలో పాల్గోకుండా నాలుగు గోడల మధ్య బంధింపబడిన 'అబల'కూ, ఇక్కడి వుత్పత్తిలో పాల్గొంటున్న ఆదివాసీ 'సబల'కూ రూపంలోనే ఎంతో తేడా అన్పించింది. బలమైన కాళ్లు, చేతులూ, దృఢమైన శరీరంతో లయబద్ధంగా వాళ్లు నడుస్తుంటే, పనిచేస్తుంటే ఎంత హుందాతనం!

ఇక అప్పటినుంచీ మొదలయ్యాయి-కష్టాలు. మేం వాళ్లు మాట్లాడిన ప్రతి మాటనూ వింటూ ఆత్రుతగా 'ఏమంటున్నారు' అని అడుగుతుంటిమాయె. బైటనుంచి వచ్చిన అక్కలకు మడియా ఎంత అలవాటు అయిపోయిందంటే మేం ఏమంటున్నరు అని అడిగితే వాళ్ళు మడియాలోనే చెప్పబోతే యిక నవ్వులు విరిసేవి. మాచేత మడియా మాటలు పలికించి మా అవకతవక ఉచ్చారణకి నవ్వేవాళ్ళు అక్కలు. వాళ్ళను చూస్తుంటే స్వచ్ఛమైన నవ్వుల్ని వాళ్ళు స్వంతం చేసుకున్నారా అనిపించింది. నిజానికి వాళ్ళతో స్నేహం చేయడానికి భాష అడ్డంకి కాలేదు. అహిరినుండి వచ్చిన వాళ్ళందరికి తెలుగు రావడంవల్లే కాక, సైగలు, కళ్ళు, కనుబొమ్మల కదలికలతోనే వాళ్ళు సంభాషించేవారు.

మహాసభ అడవిలో జరుగుతోంది కానీ బైట మహాసభలకి సన్నాహాల్లో ఏ మాత్రం తీసిపోకుండా అన్నీ అమర్చారు. సభాస్థలం చుట్టూ ఆకర్షణీయంగా నినాదాలు వ్రాసిన బ్యానర్స్ కట్టారు. సభాస్థలానికి నాలుగువైపులా వెదురుతో కూర్చోడానికి బడ్డీలు వేశారు. ప్లేట్లు, గ్లాసులు పెట్టుకునే స్టాండ్, వంటదగ్గరా, యివతలా సరుకులు పెట్టడానికి బడ్డీలు మొదలగు సమస్తం వెదురుతో చేసినవే. మొత్తం సభాస్థలి నంతా రంగురంగుల కాయితాలతో, తోరణాలతో అలంకరించారు. సానిటేషన్ చూసే వాళ్ళు చేతులు ఎక్కడ కడుగాలో, స్నానాలు ఎక్కడో, ప్రకృతి పిలుపులకి ఎటు పోవాలో అన్నీ చెపుతున్నారు.

సాయంత్రం అయింది. అందరం ఎదురు చూస్తున్న సమయం రానేవచ్చింది. ఆటపాటలకు ఆదివాసీ అక్కలు, అన్నలు వాళ్ళ గ్రామాల్లో, గల్లీల్లో ఎవరూ అడక్కుండానే ఎగురుతారేమో కానీ యిక్కడ మాత్రం మొదలుపెట్టడానికి కొంత సిగ్గు పడ్డట్టున్నారు. దళం అక్కలు చేస్తూనే వుండిరి. మొదలు కావడమే కష్టం. మొదలైతే యిక అన్నీ మరిచిపోయి ఎంతసేపు ఎగురుతారో అని. నిజంగా అలాగే అయ్యింది కూడా. ఆట, పాట మొదలయ్యిందంటే-ఎక్కడెక్కడున్నారో అంత

వరకూ-విలవిల్లాడుతూ అందరూ వస్తున్నారు. చేతులు పట్టుకొని అడుగు కలుపుతూనే వున్నారు. ఆదివాసీలనుండి వచ్చిన దళం అక్కలు అందరికంటే ముందే వున్నారు. వూళ్ళల్లో వున్నప్పుడు రాత్రల్లా ఎగిరేవాళ్ళట మరి! కళ అనేది ఎంత సహజంగా వస్తుందో, వాళ్ళ జీవితంలో ఎంతగా భాగమయిపోయిందో చూడాల్సిందే తప్ప చెప్పరాదు. అన్నల గురించీ, అక్కలగురించీ సంఘాల గురించీ, ఆచారాలు, రీతి రివాజులు, పోరాటాలు, అమరవీరులు అన్నిటిమీద అక్కడికక్కడే పాటలుకట్టి పాడతారు. మేంచూస్తుండగానే మహాసభగురించిపాడారు. దానర్థం దాదాపుగాయిలావుంటుంది "అక్కలూ మీరంతా మీ మీ వూళ్లు, రేంజిలు వదిలిపెట్టి యింత దూరం ఎందుకు వచ్చారు? మహాసభ కోసం వచ్చారు. ఈ సంఘాలు ఎందుకు పెట్టుకున్నాం? దోపిడీకి వ్యతిరేకంగా కొట్లాడడానికి" అని అలా సాగిపోతూనే వున్నది. కడుపునొప్పి, తలనొప్పి అని పడుకున్నవాళ్ళు కూడా కాలు ఆగక వచ్చి చేరేసరికి అందరం బాగా బనాయించాం. ఏం చేయం? మా చేతుల్లో ఏమీలేదు- పాట వింటే మాకు కాలు, చేయి ఆగదు, అన్నట్లు నవ్వేసి ఎగురుతూనే వుండేవారు. మమ్మల్నీ వదిలి పెట్టలేదు, మాకూ ఆట నేర్పించి వాళ్ళతో ఎగిరేట్లు చేశారు అని వేరే చెప్పనవసరం లేదుకదా!

ఇవన్నీ చూస్తున్నాం కానీ యింతమంది అక్కలు యిన్ని రేంజిలనుండి, ఎన్నో కిలోమీటర్ల దూరం నడిచివచ్చి మహాసభ పెట్టుకుంటున్నారంటే దాని వెనుక ఎన్ని సంవత్సరాల కృషి వుండి వుంటుందో, వుత్పత్తిలో పాల్గొంటున్నా, పితృస్వామ్యానికి దారుణంగా బలవుతున్న ఈ స్త్రీలను బయటకు తీసుకురావడానికి ఎన్ని కష్టాలు పడివుంటారో, అసలు ఈ అక్కలు ఇళ్లల్లో, వూర్లల్లో ఎన్ని రకాల అధికారాల్ని, రివాజుల్ని ఎదిరించి పోరాడి వుంటారో అని ఆలోచిస్తూనే వున్నాం. మహిళలను, మహిళా సంఘాలను ఆర్గనైజ్ చేయడానికి ఎన్ని అడ్డంకులో ఆచరణలో తెలిసినవాళ్లం కాబట్టి ఈ మహాసభ మమ్మల్ని మరింత ఉత్తేజపర్చింది.

నిజమే ఇదంతా ఒక రోజులోనో, నెలలోనో, సంవత్సరంలోనో వచ్చింది కాదు. దీని వెనుకాల పది సంవత్సరాలపాటు కృషి వుంది. వారి నమ్మకం సంపాయించే వరకూ వండుకుని తిని లేదా పస్తులున్న రోజులు వున్నాయి. భాష నేర్చుకోవడానికి పడ్డ పాట్లు వున్నాయి. గ్రామాల్లో పెద్దల రీతు రివాజులకు వ్యతిరేకంగా చేసిన అసంఖ్యాకమైన పంచాయితీలు వున్నాయి. బలవంతపు పెళ్ళిళ్ల రద్దుచేసి చేసిన సంఘపు పెళ్ళిళ్ల వున్నాయి. అతిముఖ్యంగా ఆదివాసీ అక్కలు రోజూరోజూ వూళ్లల్లో,

ఇళ్ళల్లో పితృస్వామిక సంకెళ్ళను తెంచుకోవడానికి చేసిన పోరాటాలు వున్నాయి. కొన్ని విషాద గాథలున్నాయి. ఎక్కువగా పోరాట విజయాలు వున్నాయి. ఈ పోరాటంలో తమకు దన్నుగా నిలిచిన దళ సభ్యులంతా వారికి సొంత అన్నలూ, అక్కల కంటే ఎక్కువే అంటే అతిశయోక్తి కాబోదు. వాళ్ళ ప్రతిమాటలో దళసభ్యులపట్ల వారికున్న ప్రేమ, ఆప్యాయత కనిపిస్తుంది.

ఆదివాసుల జీవితాల్లోకి దళం రాక ఒక పెద్ద మలుపుకు చిహ్నం. 'మీరు సంఘాల్లోకి ఎలా వచ్చారు? ఎందుకు వచ్చారు?' అని మహాసభలో ప్రతినిధులందరినీ మాట్లాడమన్నపుడు అందరి కథనం దాదాపుగా యిలాగే మొదలయ్యింది, "మా వూళ్ళోకి దళం వచ్చింది. ఆ తర్వాత...." అని. మహిళాసంఘం విషయంలో దళం అవగాహన, కృషి మరోవైపు దళాలకే ఉత్తేజాన్నిచ్చిన ఆ స్త్రీల పోరాటాలు కలగలిపి ఏ విధంగా మహిళాసంఘాల నిర్మాణానికి దారి తీశాయో మహాసభలో వాళ్ళు మాట్లాడిన మాటల్లో తేటతెల్లంగా అగుపిస్తుంది.

"దాదలు మా వూరికి వచ్చిన్రు, సంఘం పెట్టుకోవాలి అన్నరు, అన్ని అర్థం చేసుకోవాలి అన్నరు. దాదల్ని కలవడానికి వూరోల్లకి తెలువకుండా పోయేవాళ్ళం. ఇంట్లో మీరు వాళ్ళవెంట పోతారా? మా మర్యాద తీస్తారా? వయసులో వున్నారు వురుకుతున్నారు, తర్వాత మీరు యింటికి రావల్సిందే కదా! పనిలేనోల్లు అలా తిరుగుతారు, మీకు ఇవన్నీ ఎందుకు? అని రకరకాలుగా అనేవారు. అయినా వినకుండా పోయేవాళ్లం. దళం అక్కలు అన్నీ ఓపిగ్గా అర్థం చేయించేవాళ్ళు. ఇప్పుడు అందరూ అర్థం చేసుకుంటున్రు. మీటింగులకు పోయినా వూరుకుంటారు. 'సంఘంలో చేరుతాం, బలవంతపు పెళ్ళిళ్ళు చేసుకోం' అన్నాం. మొదట కొందరు స్త్రీలు కూడా వ్యతిరేకించేవారు. ఇప్పుడు అందరూ ముందుకు వస్తున్నారు".

"మేం చిన్నగా వున్నప్పుడు దళం వూర్లోకి వచ్చింది. దాదలు చెప్పిన పని చేస్తున్నాం. అక్కలు కూడా మాకు విషయాలు చెప్పేవారు. ఇప్పుడు సంఘాలు పెట్టుకుంటున్నాం. 'సంఘాలు పెడితే, మీరు వాల్లవెంట పోతారా' అనేవాళ్ళు వూరోల్లు. ముగ్గురు అక్కలు దళంలోకి పోతం అని వస్తే వూరోల్లు ఆ అక్కల్ని కొట్టిన్రు. అన్ని వూర్లలో యిప్పుడు సంఘాలు అయినాయి. ఇంకా ఎలా పనిచేయాలి అని నేర్చుకోడానికి వచ్చినం. అక్కలు దళంలోకి పోతున్రు అని కొందరు ప్రచారం చేసిన్రు. అలాంటి వాల్లను తన్నినం. తన్నితేనే అలాంటి

వాల్లు నోల్లు మూస్తారు. ఈ మధ్యనే మిలటరీ ట్రైనింగ్ కూడా నేర్చుకున్నాం. పోలీసులు అప్పుడప్పుడూ మాకోసం వచ్చి పోతారు".

"వూరోల్లు వ్యతిరేకించినా, చనిపోతారని భయపెట్టినా సంఘంలోకి పోయినం. ముందు మా పని అంతా యింటిపని, పొలంపని. దాదలు వచ్చినంక అన్ని విషయాలు తెల్సుకొని ముందుకు పోతున్నాం. ముందు దాదలు మా వూరికి వచ్చి సంఘంలో వుండమంటే తెలువక వుండమన్నాం. చెప్పంగ చెప్పంగ అర్థం చేసుకొని పెట్టుకున్నం. సంఘం క్యాంపెయిన్‌కు పోయేవాళ్ళం. కష్టసుఖాలన్నింటిలో దాదలు మాకు సహాయం చేసిన్రు. గార్డులు మమ్మల్ని చెట్లు కొట్టుకోనిచ్చేవారు కారు. సంఘం వున్నాక అన్నీ చేసుకోగల్గుతున్నాం. పెళ్ళి అయితే జాకెట్లు తీసేయమంటారు. జాకెట్లు తీయడంవల్ల అనర్థాలు ఏమిటో దాదలు చెప్పిన్రు. జాకెట్లు తీస్తే ఇంట్లో వుండద్దంటారు. దేవునికి మొక్కద్దంటారు. అవన్నీ తప్పని దాదలు చెప్పిన్రు".

"సంఘంలోకి పోతున్నాం అని అన్నం పెట్టకపోయేది ఇంట్లో. మీటింగ్‌లకు, క్యాంపెయిన్‌లకు పోకుండా చీరెలు దాచేవాళ్ళు. మా అమ్మ నువ్వు సంఘంలో వుంటే చస్తానని గోదాట్లో దూకింది. ఎవరైనా అర్థం కానపుడే అలా చేస్తారు. అందుకని వాళ్ళకు అర్థం చేయించాలి. చేయించినంక మమ్మల్ని ఇప్పుడు ఏమి అనరు. మంచిగా, నీతిగా వుండాలని మాత్రం అంటారు. వూర్లల్లో సంఘాలు పెట్టినపుడు కూడా అక్కలు "మీకిలా ఇంట్లో పని చేయకుండా తిరగడం బాగున్నట్లుంది" అనేవారు. మేం వాల్ల ఇళ్ళల్లో పనుల్లో సహాయంచేసి వారికి దగ్గరయ్యి విషయాలు అర్థం చేయించాం. 'పనిలేక ఇలా తిరుగుతారు' అనేవాళ్ళే తర్వాత సంఘాల్లోకి వచ్చిన్రు".

ఇలా ఇంకా చాలామంది మాట్లాడిన్రు. మహిళా సంఘ నిర్మాణం సాఫీగా నల్లేరుమీద బండిలా కాక కత్తిమీద సాములాగే జరిగిందనేది వాటన్నిటి సారాంశం. ఇక్కడ ఒక విషయం చెప్పడం అప్రస్తుతం కాదనుకుంటా. అక్కలను మాట్లాడమన్నపుడు వాళ్ళు ధన ధన మాట్లాడేయలేదు. చాలా సిగ్గుపడ్డారు. తడబడ్డారు. కొందరు ప్రక్కకు తిరిగి మాట్లాడారు. కొందరు ప్రేక్షకులలోంచే మాట్లాడారు. కొందరు మొదలుపెట్టి మధ్యలో ఆపేశారు. 'మేం ఎన్నడూ ఇలా మాట్లాడలేదు, అందుకే సిగ్గనిపిస్తుంది' అని అన్నారు వాళ్ళు. అయినా కూడా వాళ్ల మాట్లాడిన కొద్ది మాట

ల్లోనే యెంతో స్పష్టత కన్పించింది. మాట్లాడే అలవాటులేక తడబడ్డారే తప్ప విష యాల పట్ల అస్పష్టతతో కాదు. యెన్నడూ రాజకీయ విషయాలల్లో జోక్యం చేసుకో నివ్వక పోవడంవల్ల మైదాన ప్రాంతాల్లోనైనా, అడవిలోనైనా స్త్రీలంతా యెదుర్కొనే సమస్యే అది. అయితే వీరిలో కూడా సంఘం క్యాంపెయిన్‌లలో కానీ, సంఘ కార్య కలాపాల్లో కానీ చురుగ్గా పాల్గొన్న అక్కలు, రేంజి కమిటి, జిల్లా కమిటీలో వున్న అక్కలు ధైర్యంగా మాట్లాడారు. అంతేకాదు వారి రాజకీయ అవగాహన, లక్ష్యం పట్ల స్పష్టతా ప్రస్ఫుటంగా అగుపించాయి. వాటిల్లో కొన్ని

"సంఘం బలంగా ఉన్నప్పుడే పోలీసుల్ని యెదుర్కొగలం. మనం యెందు కోసం కొట్లాడాలి ? మా ఆదివాసి రాజ్యం మాకు కావాలి అని కొట్లాడాలి. వూర్లో అన్నలు అక్కలకు గౌరవం యివ్వరు, అన్నం వండేవాళ్ళుగా చూస్తారు. దానికి వ్యతిరేకంగా కూడా పోరాడాలి".

"మన సంఘం ఆదివాసీ మహిళా సంఘం. దీన్ని మనం యెందుకు పెట్టు కున్నాం ? మనకు చాలా కష్టాలున్నాయని పెట్టుకున్నాం. సంఘం బలంగా ఉంది కాబట్టే మనం అన్నీ నెరవేర్చుకుంటున్నాం. ఇప్పుడు ఫారెస్టువాళ్ళ దోపిడి లేదు మనకు. అడవిని నరుక్కునే హక్కు, భూమిని దున్నుకునే హక్కు వచ్చినయి. వూర్లో అక్కలు కూడా హుషారయ్యారు. ఇవన్నీ చూసే పోలీసులు వూర్లమీద పడుతున్నరు. కానీ సంఘం వుంది కాబట్టీ మా రేంజీ కమిటీ అధ్యక్షుడ్ని (DAKMS) పట్టుకుంటే మేం విడిపించుకున్నాం.

....అయితే మీరు బైటకిపోయి మా సంఘం బలంగా అయిపోయింతని చెప్తారా! అలా చెప్పొద్దు. మనం యింకా చాలా బలపడవల్సి వుంది. ఇంకా చాలా పని చేయాలి. ఇంతకుముందు అక్కల్ని ముందుకు రానివ్వకపోయేది, మాట్లాడ నివ్వక పోయేది. 'మీరేం మాట్లాడుతారు ఆడవాళ్ళ' అనేవారు. 'మీరు పది మాటలు మాట్లాడ్తే మేం రెండు మాటలు కూడా మాట్లాడద్దా' అన్నారు అక్కలు. ఇప్పుడు సంఘంలో వున్నాం. కనుకనే అన్నీ నేర్చుకుని మాట్లాడ గల్గుతున్నాం".

"మా వూర్లో అన్నల్ని వ్యతిరేకించిన వాళ్ళని తన్నినాం. అక్కడే ఉద్యమం ముందుకు పోయింది. అలా తన్నకుండా వదిలిన దగ్గర ఉద్యమం ఇప్ప టికీ కోలుకోలేదు. ఒక వూరు మంచిగా పనిచేస్తుంటే పక్కవూర్లు కూడా హుషారై

పాల్గొంటాయి. కల్లుతాగి కొందరు 'మీరేనా లీడర్లు' అని నిల్గుతారు. వాళ్ళను కూడా తన్నాలి. ఏమాత్రం ఫూరుకోవద్దు. ఏదో అన్నం తిని, నాలుగు పాటలు పాడితే సంఘం కాదు. రాజకీయాలు చెప్పాలి. మనకు ఏ మేరకు అర్థమయితే అదే అందరికి చెప్పాలి. నేను పెద్ద, నాకే అన్నీ తెలుసనుకుంటే కాదు, ఎప్పటికీ కొత్త విషయాలు నేర్చుకోవాలి".

"సంఘాన్ని బలంగా చేసుకొని కొట్లాడాలని దాదలు చెప్పిన్రు. దాదలు సంఘం పనిచేస్తున్న క్రమంలోనే మన సంఘం కూడా బలపడింది. మనం కూడా కొట్లాడాలే, భయపడద్దు. అందరికోసం, ఆకులరేటు కోసం, భూమికోసం కొట్లాడాలే. ముందుండి మాట్లాడాలే, ఆదివాసీలకు తిండికి పొలాలు పండకపోవడం చాలా కష్టాలు వున్నాయి. ఇవన్నీ ప్రజలకు అర్థం చేయించాలి. సమస్యలు అర్థం చేసుకొని కొట్లాడే క్రమంలో మనకు మరింత అవగాహన వచ్చింది. ఎప్పుడైనా కొట్లాడు తుంటేనే విషయాలు తెలుస్తాయి". ఇవి మచ్చుకు కొన్ని.

ఇంతకీ మహిళా సంఘాల కార్యక్రమాలు ఎలా వుంటున్నాయి ? వాళ్ళు ఏ సమస్యల మీద క్యాంపెయిన్‌లు, పోరాటాలు, పంచాయితీలు చేస్తున్రు ?

మహిళలను ప్రత్యేకంగా అణచివేస్తున్న రీతి రివాజుల గురించి, మహిళా సంఘాల అవశ్యకత గురించేకాక అప్పటికి అక్కడ మొత్తం ఆదివాసీలందరూ ఎదుర్కొనే, కరువు, అధిక ధరలు, గల్ఫ్‌యుద్ధం, పేపరు మిల్లు, ఆకుల కూలీ రేట్లు, రోడ్డు పనుల కూలీ రేట్లు అన్నిటిగూర్చి వాళ్ళు ప్రచార ఆందోళనా కార్య క్రమాలు తీసుకుంటారు.

రీతి రివాజులు అంటే పెళ్ళి అయినంక జాకెట్లు తీసివేసి తెల్ల చీరలు కట్టించి అందవికారంగా తయారుచేస్తారు. వ్యవసాయం పనులు అన్నీ చేసిన తర్వాత ఆఖరికి యిక ఉత్పత్తి చేతికొచ్చినంక అంటే కల్లంలోకి పంట చేరినంక స్త్రీలను కల్లం లోకి రానియ్యరు. అంటే యిక స్త్రీకి ఆ ఉత్పత్తిమీద ఎటువంటి హక్కు ఉండ దన్నట్లు, కూతురు పెళ్ళి అయినంక మళ్ళీ పుట్టింటికి వస్తే వంట యింటిలోకి పోనియ్యరు. గుడ్డు తినకూడదంటారు. కొన్ని పండుగలకు మేకలు, కోళ్లు కోసినా మగవాళ్ళే వండుకుని తింటారు. బలవంతపు పెళ్ళిల్లు చేస్తారు. ఇట్లా తరతరాల నుంచి వస్తున్న రీతి రివాజుల పేరుతో స్త్రీకి అనేక నిషేధాలు అమలుచేస్తుంటారు.

వీటి గురించి మహిళా సంఘం కార్యకర్తలు, సభ్యులు ప్రధానంగా నచ్చజెప్పి మార్చే పద్ధతిలో ప్రచారం చేస్తుంటారు. ఆదివాసులు ఒక్కసారిగా వాటిని వదులు కోవడానికి కూడా సిద్ధంగా వుండరు. పూర్తిగా యివన్నీ మారడానికి కొంత సమయమే తీసుకుంటుంది.

అయితే ఈ క్యాంపెయిన్‌లు, ఆందోళనలు అన్ని చేసేదీ ఆదివాసీ మహిళలే. జట్లుగా వేరు వేరు గ్రామాలు తిరుగుతూ అప్పటికి ఏ సమస్యమీద కార్యక్రమం తీసుకున్నారో దాని గురించి మీటింగ్‌లు పెట్టి మాట్లాడ్డం, పాటలు పాడటం ప్రజల్ని కదిలియ్యడం చేస్తారు. బలవంతపు పెళ్ళిల్లు, తమకంటే చాలా చిన్నవాళ్ళని భార్యలుగా చేసుకోవడం, మహిళలను తక్కువగా మాట్లాడ్డం-యిలా గ్రామాలకి పోయినపుడు ఎన్నో సమస్యలు మహిళలు ఈ కార్యకర్తల ముందు వుంచుతారు. వాటిని అక్కడే పంచాయితి పెట్టి పరిష్కరిస్తుంటారు. అయితే-

ఇప్పుడు ఆదివాసీ అక్కలకు మరో ప్రధానమైన విషయం-పోలీసు నిర్బంధాన్ని ఎదుర్కోవడం కూడా అయింది. ఎందుకంటే ఈ ఆదివాసీలు ఫారెస్టు వాళ్ళకు, కాంట్రాక్టర్లకు, ప్రభుత్వ అధికారులకూ ఎవరికి వెరువక చైతన్యవంతమయిన్రు. కూలీ రేట్లు పెంచుకుంటున్రు. దోపిడికి వ్యతిరేకంగా ఎన్నో పోరాటాలు చేస్తున్రు. ప్రజల్ని దోపిడి చేసి బ్రతుకుతున్న ప్రభుత్వానికి సహజంగానే యిది భరించడం కష్టం. అందుకని ఆదివాసీ ప్రజల మీద పాశవిక నిర్బంధానికి అది పాల్పడుతుంది. అది రోజురోజుకూ పెరుగుతుంది. ఇటువంటి పరిస్థితుల్లో తమ భర్తలనూ, అన్నలనూ అరెస్టులు చేయడానికి వస్తున్న పోలీసులను ఎదుర్కొని వాళ్ళను కాపాడుకోవాల్సిన కర్తవ్యం అక్కల ముందుకొచ్చింది. వాళ్ళు ఎంతో వీరోచితంగా పోలీసుల నెదుర్కొంటూ ప్రజా సంఘాల్ని, పార్టీని కాపాడుకుంటున్నారు. 'పార్టీకి ప్రజలే నిజమైన ఉక్కుకోట' అని వారు ఆచరణలో ఋజువు చేస్తున్నారు. ఎన్నో వూర్లలో తమ సంఘనాయకులను పట్టుకోడానికి వచ్చిన పోలీసులను తన్నడం లేదా ఎదిరించడం ద్వారా వాళ్ళను పోలీసుల చేతులనించి తప్పించారు. స్త్రీ శక్తిముందు నిలవలేక పోలీసులు తోకముడుచుకోవాల్సి వచ్చేది. రాజారం, గురజ, ఎమలికస్స, రేగులవాయి, గుండేర, కొత్తకొండ, జెప్పి, కోత్రబమెంద, ఎడ్జికుయ్, అల్లపెల్లి, సురుసొండి-యింకా ఎన్నో వూళ్ళల్లో- ఒక్కొక్క వూళ్ళో ఒక్కోరకంగా స్త్రీలే ముందుండి పోలీసుల్ని ఎదుర్కొన్న ఘటనలన్నీ మహిళా వుద్యమ చరిత్రలో నిలిచిపోయేవే.

మహాసభలో ఆదివాసీ అక్కల మాటల్లో పోలీసుల నెదుర్కోవాలి అనేది సహజంగానే ప్రధాన అంశమైంది. 'మనమే ముందుండి అన్నల్ని కాపాడుకోవాలి. మనం ఐక్యంగా వుంటే మనవాళ్ళని పోలీసులు పట్టుకోలేరు' అని అందరూ మాట్లాడారు. తమను ప్రత్యేకంగా అణచివేస్తున్న రీతి రివాజులనూ, మరో మాటలో పితృస్వామ్యాన్ని, ఆదివాసులుగా తమను అణచివేస్తున్న ఫారెస్టు అధికారులు, కాంట్రాక్టర్లు, బెంగాలీలనూ, ఆ పోరాటాల పర్యవసానంగా వస్తున్న ప్రభుత్వ నిర్బంధాన్ని అన్నిటినీ ఎదిరించడంలో మహిళాసంఘం ముందు పీటాన నిలుస్తోంది. అంతేకాదు వాళ్ళు తమ మగవాళ్ళలో వున్న పితృస్వామ్య భావాలను క్రమంగా పోగొట్టడంలో కూడా విజయవంతమయ్యారు. అంతకు ముందు స్త్రీలను దళం ముందుకు, దగ్గరకు పోనీయక పోయేవారు దాదలు, దళం వాళ్ళను కూడా తీసుక రావాలి అనీ, మీరు మిగతా ప్రజల్ని సంఘంలో వుండమనీ చెప్తారు. కాని మీ యింట్లో మీ భార్యా, చెల్లెళ్లను సభ్యులుగా చేరనివ్వకపోతే మిగతావాళ్ళు ఎలా చేర తారు అనీ రకరకాలుగా వాళ్ళకు నచ్చచెప్పితే స్త్రీలను సంఘాల్లోకి రానిచ్చేవారు. అక్కలు పూర్లలోని స్త్రీలతో విడిగా మాట్లాడితే 'మీరు వాళ్ళను మాకు వ్యతిరేకంగా తయారుచేస్తారా' అనేవారు. స్త్రీలను 'మీ పని వంటచేయడమే' అని ఈసడించేవారు. ఎన్నో రకాలుగా స్త్రీలను నిరుత్సాహపరచేవారు. అటువంటిది ఈ రోజు ఒక ఊరేగింపు తీయాలంటే దాదలు 'అక్కలు రాకుంటా ఊరేగింపు ఎట్ల అయితది' అంటున్నారు. విప్లవంలో వాళ్ళ పాత్రను గుర్తిస్తున్నారు. ఈ మార్పుని ఆ అక్కలు అన్ని అననుకూల పరిస్థితుల్లో కూడా గట్టిగా నిలబడటం ద్వారానే సాధించారు. ఎప్పటికైనా పితృస్వామ్యం అనేది ప్రధానంగా స్త్రీలు చైతన్యవంతులై సామాజిక, ఆర్థిక, రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొనడం ద్వారా నిర్మూలింపబడుతుందని వారు మరోసారి నిరూపిస్తున్నారు. అంటే పితృస్వామ్యం పూర్తిగా అదృశ్యమైందని కాదు దానర్థం. ఆ క్రమం మొదలైందనే అందుకనే ఈ రోజు మహిళాసంఘం జిల్లా మహాసభ జరుగుతుందంటే దాని వెనుకాల యిన్ని సంవత్సరాల చరిత్ర వుంది. దేశంలో అత్యంత వెనుకబడిన జనాభా అయిన గిరిజనులను చైతన్యవంతం చేసిన కృషి వుంది.

అయితే మరోవైపు- ఎక్కడయితే DAKMS బలంగా వుందో అక్కడే మహిళా సంఘాలు బలంగా ఏర్పడినాయి. అందుకు ఆ దాదల ప్రోత్సాహం, కృషి కూడా కారణం అని చెప్పక తప్పదు.

మహాసభ కా॥ స్వర్ణలత నగర్‌లో, కా॥ కుర్సం రాజక్క హాలులో రెండు రోజులు జరిగింది. మొదట అందరం అమరవీరులకు మౌనం పాటించి, జెండా ఆవిష్కరించడానికి బారులు తీరి నిల్చున్నాం. జెండా ఆవిష్కరణ, పాట, అమర వీరులకు మౌనం, ఛీఫ్‌గెస్ట్ ఉపన్యాసం, ఫారెస్టు కమిటీ సందేశం, DAKMS సందేశం, ప్రణాళికా వివరణ, ప్రతినిధులందరి ఉపన్యాసాలూ, ఎన్నికలు-తీర్మానాలు -ఇదీ రెండు రోజుల కార్యక్రమం. అన్నలూ, అక్కలూ అన్నీ వివరిస్తుంటే ప్రతి నిధులంతా ఆ విషయాల్ని ఆసక్తిగా విన్నారు. చదువొచ్చినవాళ్ళు కొందరు రాసు కున్నారు కూడా. అక్కడున్న నాలుగు రోజులు రాత్రి అయితే ఎగరడం, పాటలు, సాంస్కృతిక కార్యక్రమం తప్పనిసరే. ఆఖరిరోజు రాత్రంతా ఎగరాలనే మా ఆశల్ని వమ్ము చేస్తూ ఘోరున వర్షం. మహాసభను ముగిస్తూ ఫారెస్టు కమిటీ సభ్యులు రాబోతున్న నిర్బంధం గురించీ, సంఘాల్ని బలోపేతం చేయాల్సిన ఆవశ్యకత గురించీ మాట్లాడారు. దానితో రెండు రోజులపాటు ఎంతో ఉత్తేజకరంగా జరిగిన మహాసభ ముగిసింది. ప్రతినిధులందరూ కూడా మహాసభ విశేషాల్ని, తీర్మానాల్ని ప్రజల్లోకి తీసుకెళ్ళాలని, కొత్త ఊర్లలో కూడా సంఘాలు పెట్టాలనే ఆశయాన్ని నింపుకొని బయల్దేరారు.

జట్లు జట్లుగా అందరూ విడిపోతుంటే 'అప్పుడే అయిపోయిందా మహాసభ, మరికొంత సేపు ఆ అక్కలతో వారి అనుభవాలన్నీ పంచుకుంటే బాగుండేది' అని పించేది. కాని ఈ మహాసభ దండకారణ్య వ్యాప్తంగా నిర్మితమవుతున్న మహిళా వుద్యమానికి ఒక ఆరంభం మాత్రమే. వాళ్ళు తిరిగి గ్రామాల్లోకి పోయి పని చేస్తున్న క్రమంలో ఎప్పటికీ కొత్త అనుభవాలు, విజయాలు, అపజయాలు ఎన్నో ఎదురౌతూనే వుంటాయి. ఆ అక్కల్ని చూస్తుంటే ఎటువంటి అడ్డంకులనైనా ఎదుర్కొని విముక్తి సాధించిగానీ ఊరుకోరని అన్పించింది. వాళ్ళు అందుకు అన్ని విధాల 'సాయుధ' మౌతున్నారు. అంతిమంగా విజయం ప్రజలదే అనటంలో మాకే మాత్రం సందేహం మిగల్లేదు.

ఆ అక్కల నవ్వుముఖాలు, మాటలు, పోరాటాలు, అనుభవాల్ని అన్నిటినీ పదిలంగా మనసులో భద్రపరచుకొని, వాళ్ళు అడవిలో చేస్తున్న పోరాటానికి తోడుగా మైదాన ప్రాంతాల్లో కూడా గ్రామీణ మహిళా ఉద్యమాన్ని మరింత బాగా నిర్మించాలను కుంటూ-

* జోత్ నేవాలేకో జమీన్ చాహియే !
* క్రాంతికారి ఆదివాసి మహిళా సంఘటన్ జిందాబాద్ !
* అమర్ వీర్ షహీదోంకో లాల్ సలాం !
* నిర్మిస్తాం నిర్మిస్తాం-గెరిల్లాజోన్ నిర్మిస్తాం !
* దండకారణ్య ఆదివాసీ కిసాన్ మజ్దూర్ సంఘటన్ జిందాబాద్ !
* నూతన ప్రజాస్వామిక విప్లవం వర్థిల్లాలి !

ఇంకా ఎన్నో నినాదాల మధ్య ఉద్వేగపూరిత వాతావరణంలో ఒకరికొకరం లాల్ సలాం చెప్పుకుంటూ వారినుంచి వీడ్కోలు తీసుకున్నాం.

తాము చరిత్ర సృష్టిస్తున్నామని అనుకోకుండానే భారతదేశంలో మహిళా వుద్యమ చరిత్రకి సోపానాలు నిర్మిస్తున్న ఆ ఆదివాసీ అక్కల పట్ల అభిమానంతో మా మనస్సు నిండిపోయింది.

—లత
సుజాత

---

# లాకప్‌బర్త్

వాడు
ఇనుప చువ్వల వెనుక
నా ప్రాణంలో మానంలో దిగబడిన, కత్తుల గాయపు రక్తపుధార
అధికారం చేసిన పుండుకి కారిన సొన
చీకట్లో చట్టం కార్చిన వీర్యపు బిందువు
కన్నీళ్ళు బొగ్గులై కడుపు కొలిమిలో మండిన నెగడు
వేయి కత్తుల కటకటారావాల మధ్య
ఒక విస్ఫోటనం నుండి పుట్టిన పొలికేక
బాల్యం అడుకొన్న దారిద్ర్యపు బంతి
యవ్వనం పాడుకున్న ఆకలిగీతం
రాజ్యహింస ఉక్కుపాదం కింద పదునెక్కిన బాణం
జనకుల రాజ్యాన్ని జయించడానికి
అడవిలో రూపొందుతున్న వ్యూహం

—రాప్తాడు గోపాలకృష్ణ

# ఆడవారి బానిసత్వానికి మాతృత్వం కారణమా ?

స్త్రీ, పురుష సమానత్వం గురించి రెండు రకాల వాదనలూ, అందులో కొన్ని మినహాయింపులూ మొదటి నుండి వస్తూనే వున్నాయి. స్త్రీల చైతన్యాన్ని సమర్థించే వారు స్త్రీలు అన్నిటిలో పురుషులతో సమానమని చైనా, రష్యా, వియత్నాం వంటి దేశాల్లో విముక్తి ఉద్యమాలలో పాల్గొన్న స్త్రీల చరిత్రలు, సాహసాలు వివరిస్తున్నారు. స్త్రీల చైతన్యాన్ని సమర్థించలేనివారు, ఎన్ని మాట్లాడినా, ఆడవాళ్ళు ఆడవాళ్ళేనని ప్రకృతే వారికి అడ్డంకి కనుక మనమేమి చెయ్యగలమని అంటున్నారు.

దీన్ని దృష్టిలో పెట్టుకుని మొత్తంగా ఈ విషయాన్ని ఎలా అర్థం చేసుకోవాలన్నది ఆలోచిద్దాం. స్త్రీలు, పురుషులతోపాటు సమానమేనని చెప్పేవారు, స్త్రీలు రోదసిలో వెళ్ళటం, యుద్ధాలు చెయ్యటం వంటివి వర్ణిస్తారు. అదేగాక స్త్రీలను చిన్నప్పటినుండే పురుషులతోపాటు సమానంగా పెంచాలని, స్త్రీలు మానసికంగానూ సామాజికంగానూ న్యూనతకు గురికాకుండా చేయాలని, ఇలా చేయటం వలన, స్త్రీలు శారీరకంగా దృఢకాయులై, మానసికంగా ఎంతో మార్పుకు గురౌతారని భావిస్తున్నారు. ఇదీ వాస్తవం కూడానూ. ఆహారం దగ్గర నుండి ఆచారాల వరకు స్త్రీలను హీనపరచి తమంతటతామే దిగజార్చుకునే లక్షణాన్ని స్త్రీలలో సమాజం పెంచ కూడదు. బాగా తాగి వచ్చి భార్యను కొట్టే మగవాణ్ని ఎదురు తిరిగి భార్య కొట్ట గలిగే పరిస్థితి వున్నా, ఆమె అందుకు సిద్ధపడదు. ఎందువల్ల ? భర్తను కొట్టిన ఆడదానికి సమాజంలో గౌరవం లేదు గనుక చచ్చినట్లు అతనితో తన్నులు తింటుంది. ఇదిగో ఇలాంటి దృక్పథాన్ని మార్చి, స్త్రీలను చైతన్యవంతులను చెయ్యాలన్న ఆలోచన. ఈ దృక్పథాన్ని ఫెమినిస్టు ఉద్యమం మరింత పెంచింది. ఇది సామాజికంగా మార్పు తీసుకురావాలని, అభ్యుదయకరంగా ఆలోచించే విషయం. ఈనాడు అభివృద్ధి అయిన సైన్సు స్త్రీలకు ఎంతో మేలుచేసి సమాజంలోని అన్ని రంగాలలో వారి పురోభివృద్ధికి తోడ్పడుతుందని చెప్పే విషయం. మరొకటి స్త్రీలకు ప్రకృతి పరంగా వుండే గర్భధారణ, పాలివ్వటం, పెంపకం వంటి విషయాల్లో సైన్సు చాలా సమస్యలను తీరుస్తుందని చెప్తారు. సైన్సు అభివృద్ధి చెందిన దశలో గర్భం ధరించినా

కాన్పు కాష్టం కాకుండా చేస్తారని, పిల్లలు పుట్టినా, వారిని పెంచటం ఇన్నాళ్ళలాగా కాక క్రెచ్‌ల వంటి సదుపాయాలుంటాయని, కనుక స్త్రీలు కుటుంబంలోనే కూరుకు పోయి వుండనక్కరలేదని, పురుషుడితో సమాన హోదానూ, స్థాయినీ అనుభవించ వచ్చని చెప్తారు. ఇంకా రాబోయే కాలంలో సైన్సు పెరిగి, స్త్రీలు గర్భం ధరించి కననక్కరలేని స్థితినీ కల్పిస్తుంది. టెస్ట్‌ట్యూబ్ బేబీల ఉత్పత్తే కాకుండా, మనిషి గర్భంలో వుండే వాతావరణాన్ని సృష్టించి పిల్లలను బయటనే పెంపొందించాలన్న కృషి. ఇది చూడటానికి స్త్రీలకు ఎంతో ఉపయోగపడేదిగా, అభ్యుదయ కరంగా వున్నట్లు కన్పిస్తుంది ఈ విజ్ఞానం స్త్రీలను సమాజంలో ఉన్నతురాలిగా వుంచటానికి ఉపయోగపడుతుందా ? లేక స్త్రీలనే సమూలంగా తీసివెయ్యటానికి చేసే ప్రయత్నమా ఆలోచిద్దాం. ఇది పైకి ఎంత విజ్ఞాన దాయకంగా కనిపిస్తుందో, అంత సంకుచిత మయింది. పెట్టుబడిదారి సమాజంలో సరుకుకూ, మానవుడికి తేడాలేని స్థితిలో, మానవ ప్రపంచంలో స్త్రీల ఉనికిని నిర్వీర్యం చేసే ప్రయత్నం. స్త్రీలకున్న Natural Right [సహజాతపు హక్కు]ని కాలరాయటం. స్త్రీలకు నిజంగా ప్రకృతే అడ్డంకి అనుకుంటే ఈ ప్రకృతిలో నుండి ఉద్భవించిన అనేక అవాంత రాలను ఎలా అధిగమిస్తున్నాం లేక ప్రకృతి సహజమయిన ఈ పునరుత్పత్తి విధా నమే తప్పా ? ఆలోచించండి. పునరుత్పత్తి విధానంలో స్త్రీలకు కొన్ని అవాంతరాలు ఎదురైతే మానవ సమాజం వాటిని తొలగించటం ద్వారా ఆ పద్ధతిని గౌరవించాలి. ఉన్నత మానవ విలువలను కాపాడాలి. అంతేగాని మాతృత్వం పేరుతో Myth ని సృష్టించి, దేవతను చేసి, చివరకు కాలికింద వేసి త్రొక్కటం కాదు సమాజం చెయ్య వలసింది. కాబట్టి పైన చెప్పిన ఆధునిక విజ్ఞానం స్త్రీల ఈ Natural Right ని అణచివేసే ప్రయత్నం చేస్తుంది. ఈ విషయం వినగానే మనకొక అనుమానం రావచ్చు–సైన్సు అభివృద్ధి అయితే నష్టమేమిటి అని. ఈ పెట్టుబడిదారీ సమాజం స్త్రీల ఉనికిని నిర్వీర్యం చెయ్యటానికి ఈ కృత్రిమ బేబీల ఉత్పత్తి ఉపయోగించ వచ్చునేమోకాని సోషలిస్టు సమాజం సైన్సును మానవ సమాజ అభివృద్ధికి ఉపయో గించుకోవచ్చు కదా అని. ఇది పైపైగా చూస్తే మంచి ప్రశ్నే. అసలు సోషలిస్టు సమాజంలో ఈ కృత్రిమ ఉత్పత్తుల ఆర్భాటాలెందుకు ? మానవులకున్న సహజ వనరులను ఉపయోగించుకోరాదా ? అసలు ఎప్పటికైనా మానవ శక్తికి ప్రత్యా మ్నాయం చెయ్యగలిగిన స్థితి సమాజంలో వుంటుందా ? సమసమాజంలో 'నా'

పిల్లలే కావాలన్న స్వార్థపూరితాలోచనలు రాకూడదు కనుక ఆనాడు టెస్ట్‌ట్యూబ్ బేబీల అవసరమే లేదు కదా? మానవ వనరులపై గౌరవ ముంటుంది కనుక స్త్రీల పునరుత్పత్తి శక్తిని సమాజం ఉపయోగించుకుంటుంది. అప్పుడు ఈ కుహనా అభ్యుదయకరమైన టెస్ట్‌ట్యూబ్ బేబీలు, కృత్రిమ గర్భాశయ వాతావరణ నిర్మాణం అవసరం రాదు. ఈనాడు వాటిమీద ప్రయోగాలు జరుగుతున్నాయంటే, స్త్రీల ఉనికి మీద ఆ ప్రభావం ఈ సమాజంలో తప్పక పడుతుంది. అయినా సైన్సు అభివృద్ధి అయింది కనుక స్త్రీలు సమానత్వం పొందుతారనే కుంటిసాకులు స్త్రీలను మభ్య పెట్టాలని చూసేవే గాని, మానవుడి ఆలోచనలు పెరగందే సైన్సు పెరిగి ఏం లాభం? కంప్యూటర్లని చూస్తున్నాం, అన్నియో సెంథసీస్‌ని చూస్తున్నాం ఏం జరుగుతుందో తెలియటం లేదా? కనుక దీన్ని ఎదుర్కోవటం కూడా మన ఉద్యమంలో భాగంగా ఆలోచించాలి. స్త్రీలను నోరులేని జీవాలుగా చేసే ఈ తిరోగమన విధానాన్ని తిప్పి కొట్టాలి.

స్త్రీలు అన్నిటా సమానులేనని చెప్పే ఈ దుర్మార్గపు దృక్పథం ఒకటైతే, అసలు స్త్రీలు ఎప్పటికీ పురుషులతో సమానులు కారన్న దారుణమైన దృష్టి మరొకటి. ప్రకృతే స్త్రీలకు అడ్డంకి అని ప్రధానంగా వాదిస్తున్నవారు వీరే. గర్భధారణ, పాలివ్వటం, పెంపకం వంటి పనుల వల్ల మానసిక శారీరక విభాగాల్లో ఎంతో మార్పు వస్తుంది కనుక దీనిని అధిగమించలేమని చెప్తున్నారు. ఈ దృక్పథాన్ని గురించి ఆలోచిద్దాం.

విముక్తి పోరాటాల్లో ఈ అడ్డంకిని అధిగమించి పాల్గొన్న స్త్రీలూ వున్నారు. ఉత్పత్తి కార్యక్రమాల్లో పాల్గొంటున్న మహిళా కార్మికులూ వుంటున్నారు. పొలాలల్లో పనిచేస్తూనే ప్రసవించే వ్యవసాయ మహిళా కూలీలూ వున్నారు. వీటిని బట్టి అవసరాలు అన్నిటిని అధిగమిస్తాయని చెప్పుకోవచ్చు. అంతేగాని వీటిలో పాల్గొంటున్నారు గనుక గర్భధారణ స్త్రీల కేమాత్రం పరిమితులను విధించదని చెప్పటం అసమంజసం. అయితే ఈ ఇబ్బంది వున్నప్పటికీ దీన్ని ఎలా అర్థం చేసుకొని, ఎదుర్కోవాలి? ప్రకృతి మనకు అడ్డం కనుక అన్నిటిలోనూ ఆఖరుగానే వుండి సమాజం విధించిన కట్టుబాట్లలోనే వుండాలా? లేక సమాజం మొత్తం చైతన్యాన్ని పెంచుకుని దీన్ని అర్థం చేసుకోవాలా?

మానవ సమాజం ప్రాథమిక, ప్రధానమైన ఉత్పత్తి మానవ ఉత్పత్తి లేదా

పునరుత్పత్తి. ఈ పునరుత్పత్తి కోసం సృష్టించుకొన్నదే సరుకుల ఉత్పత్తి. ఇది కల్పిత ఉత్పత్తి. అంటే ప్రకృతిలో దొరికిన వస్తువులను యథాతథంగా కాక, కొన్ని మానవ కల్పిత చర్యలతో ఉత్పత్తి చేస్తూ మనకు అనుకూలమైన విధంగా అనుభవిస్తున్నాం. ఈ సరుకుల ఉత్పత్తికి, ఆ ఉత్పత్తిదారులు ఎలా యజమానులో పునరుత్పత్తికీ కూడా అలాగే ఆ ఉత్పత్తిదారులే యజమానులు కావాలన్న అంశమొకటి. ఇన్నాళ్ళు ఈ హక్కు పురుషులే అనుభవించారు కనుక ఇక మా హక్కుని మేమే అనుభవిస్తామని స్త్రీలంటున్నారు. పురుషుల హక్కా: స్త్రీ హక్కా లేక ఇద్దరికీ సమానహక్కా ? అన్నది తరువాత మాట్లాడుకుందాం.

పునరుత్పత్తికీ, సరుకుల ఉత్పత్తికీ వున్న సామ్యమూ ? తేడాలూ రెంటినీ దృష్టిలో పెట్టుకుని ఆలోచిద్దాం. మానవ సమాజం ఏం చేస్తుంది ? కృత్రిమ ఉత్పత్తి అయిన సరుకుల ఉత్పత్తికి అత్యంత ప్రాముఖ్యత నిస్తుంది. మార్కెట్ కంట్రోల్, డబ్బు, మాయల చుట్టూ మానవ సమాజాన్ని తిప్పుతోందీ బూర్జువా సమాజం. మన ఇంట్లో కారు, టి.వి. ఫ్రిజ్ మన మాటకు విలువ పెంచుతోంది. మనకు అప్పుపెట్టి ఆయుధాలిచ్చేవాడి మాట మనకు శాసనమవుతుంది. ఈ స్థితిలో వ్యక్తుల వ్యక్తిత్వాలు నశించి పోతున్నాయి. మానవులు సమూహాలలో సహితం వంటరి వారయి పోతున్నారు. ఇలాంటి స్థితిలో ప్రత్యేకంగా స్త్రీలకి గౌరవం ఏం మిగులుతుంది ? ఇది వినగానే ఒక ఆలోచన రావచ్చు. సోషలిస్టు సమాజంలో ఈ గొడవంతా వుండదు కదా. ఆ సమాజంలో సరుకుల కింత విలువ వుండదు కనుక స్త్రీలు ఆ సమాజంలో గౌరవింపబడతారని, ఒక్క మాటలో చెప్పుకుంటే చాలుతుందనుకోను. ఆ సమాజంలో కూడా దేనికోసం ఈ ఉత్పత్తి అని ప్రశ్న వేసుకోవడమేగాక, మనచే తయారుచేయబడే ఆహారం, అస్త్రాయుధాలు, గ్రహాంతర వాసాలు అన్నీ కూడా ప్రధానమైన ప్రకృతి పరమైన మానవ ఉత్పత్తికి లోబడి వుండవలసిందే. అలాంటి సమాజంలో, ఆ సాంఘిక ధర్మాన్ని అంగీకరించి, ఆచరించే సమాజంలో సాంస్కృతిక ఆలోచనల్లో కూడా ఎంతో మార్పు వస్తుంది. అయితే ఆనాడైనా, కృత్రిమ ఉత్పత్తులకు గౌరవం ఇవ్వటం మానిన రోజైనా ప్రకృతి సంబంధాలపై గౌరవం పెరగాలన్న నిబంధన లేమీ లేవు. ఇది అప్పుడైనా పోరాడి గెలవాల్సిన అంశమే. బహుశ కమ్యూనిస్టు దశకు మారే క్రమంలో సాగే పోరాటాల్లో ఈ పునరుత్పత్తి విధానంపై పోరాటం ప్రధానమైన వాటిల్లో ఒకటి కావచ్చు. ఆ దశలో కూడా ప్రకృతి

లోని రహస్యాలను, అనంతమైన విశ్వరహస్య విచ్ఛేదనాలు చెయ్యడమేగాక, అంతకంటే భిన్నమైన మానవుడి మనుగడ విధానం మీద పోరాటం, వాయువేగం కంటే వేగవంతమైన మనోవేగం, దాని కోర్కెల మీద పోరాటం తక్కువ స్థాయి లోనే ఉండవచ్చు. సమాన సమాజం వచ్చింది కనుక అందరికీ విలాసవంతమైన జీవితం కోసం పరుగులు పెట్టదు. అలాంటి ఆలోచనలను ప్రేరేపించదు. శ్రమలో భాగం పంచుకుంటూ మానవ మేధస్సుని పరిపూర్ణంగా ఉపయోగించుకుంటుంది. అవసరాలకు తగిన వనరులను ఉపయోగించుకోవటానికి ప్రకృతిపై ఆధారపడటం, ప్రకృతితో స్నేహం చేస్తూ, ప్రకృతిపై పోరాడటం లక్ష్యంగా వుండాలి. అలా సహజ వనరులపై ఆధారపడటం, సహజ వనరులను గౌరవించటం, సహజాతాలయిన మానవ సంబంధాలను ఉన్నతీకరించు కోవటం ఆ సమాజ లక్ష్యంగా వుంటుంది. ఇలా మానవ సమాజ ఆలోచనలు పెరిగిన్నాడు మాత్రమే స్త్రీల ప్రకృతి ఉత్పాదనా శక్తిని గౌరవిస్తారు. అందులో భాగస్వాములయిన స్త్రీ, పురుషులకు సమాన గౌరవం లభిస్తుంది. అలా అని స్త్రీని దేవతను చేసి మూలన కూర్చోబెట్టటం కాదు. గతి తార్కిక విశ్లేషణా క్రమ వికాసం దీని ప్రాతిపదిక అవుతుంది. దేవతను చేసి వ్యక్తిత్వాన్ని నిర్మూలించకుండా సంపూర్ణ మానవిగా మూర్తీభవింప చెయ్యటం జరుగుతుంది. ఈ మార్పు కోసం, ఆ చైతన్య క్రమాన్ని పెంచుకోవటం, ఆచరణ రూపానికి మారడ మొక్కటే, స్త్రీలనూ పురుషులనూ సమానులుగా చేస్తుంది. ఇలాంటి సమాజా విర్భావానికి ఉపయోగపడే ఆచరణ క్రమమే మానవులను సమానులను చేసే మార్పుల క్రమానుగతానికి ఉపయోగపడుతుంది.

—నల్లూరి రుక్మిణి

---

చందాలు, రచనలు, విరాళాలు పంపాల్సిన చిరునామా :

వి. చెంచయ్య,

6-5-13, పిన్నంరాజువీధి, కావలి-524 201

# నేలతల్లి విముక్తికోసం మహిళలు

తరతరాలుగా భారత ప్రజానీకం దోపిడీ పీడనలకు గురవుతున్నారు. అయితే తమపై జరుగుతున్న దోపిడీ పీడనలకు ప్రజలు సహిస్తూ వూరుకోలేదు. ఆనాడు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాల్లో కాని వ్వండి, యీనాడు ఫ్యూడల్స్‌కు దళారీ పెట్టుబడిదారులకు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాల్లో కానివ్వండి ప్రజలు నిర్వహించిన, నిర్వహిస్తున్న పాత్ర చరిత్రలో రక్తాక్షరాలతో లిఖించబడుతూనే వున్నా, ఆ పోరాటాలకు సరియైన విముక్తి మార్గం చూపింది నక్సల్బరీ పోరాటమే.

నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాలను అణిచామని పాలకవర్గాలు చంకలు గుద్దు కొని తేరుకోనక ముందే వుత్తర తెలంగాణాలో నక్సల్బరీ పుట్టింది. అక్కడినుండి తూర్పు కనుమల్లోని ఏజెన్సీలో ప్రవేశించి మళ్ళీ శ్రీకాకుళంలో తన ఎర్రని కాంతి కిరణాలను యీనాడు నలుదిశలకు విస్తరింపజేస్తోంది. నక్సల్బరీ శ్రీకాకుళం పోరాటాల కొనసాగింపే యీ రోజు వుత్తర తెలంగాణా. తనను అణిచివేసే శక్తి ఏ పాలక వర్గానికీ లేదనీ, ప్రజలే అజేయులనీ మరొకసారి రుజువుచేసింది. వుత్తర తెలంగాణా తాను వున్నచోటనే లేదు. అది రాష్ట్ర సరిహద్దులను దాటి మహారాష్ట్ర మధ్యప్రదేశ్ (దండకారణ్యానికి)కు చేరి అక్కడినుండి సమస్త భారతదేశ విముక్తి మార్గంపైపు పయనిస్తోంది.

ప్రళయానికి ముందు సముద్రం ప్రశాంతంగా వున్నట్టు, నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాలు తాత్కాలికంగా అణిచివేయబడ్డ కొద్ది విరామ కాలం తర్వాత కరీంనగర్ ఆదిలాబాద్, వరంగల్, ఖమ్మం, నిజామాబాద్, వుత్తర తెలంగాణా జిల్లాల్లో దోపిడీ వ్యవస్థకు వ్యతిరేకంగా రైతాంగ గిరిజన, కార్మిక తదితర పీడిత ప్రజల పోరాటాలు ప్రారంభమయ్యాయి. పోరాటాల్ని మొగ్గలోనే తుంచాలని ప్రభుత్వం తన సాయుధ బలగాల ద్వారా ప్రజలను ఎన్నోరకాల చిత్రహింసలకు గురిచేసింది. ప్రజా కార్య కర్తలను, నాయకులను ప్రజలముందే కాల్చిచంపి బూటకపు ఎన్‌కౌంటర్ల కట్టుకథ లల్లింది. దాడులు, చిత్రహింసలు, లాకప్ హత్యలు, శైశవ ప్రజా ఉద్యమాన్ని ఆప లేకపోయాయి. విప్లవాళ యూన్నుండి ప్రజలను మరలించలేక పోయాయి. పైగా మరింత తీవ్ర రూపంలో పోరాటాలు విస్తరిస్తున్నాయి.

చరిత్రలో యిప్పటివరకు ప్రజలు తమ నేలతల్లి విముక్తి కోసం ఎన్నో త్యాగాలు చేసారు. కాని లిఖితరూపంలో వున్న వారి త్యాగాలచరిత్ర చాలా స్వల్పమే. ఆ ప్రజలు చేసిన త్యాగాల్ని నిలబెట్టి, మన ముందుతరాలకు అందించాల్సిన బాధ్యత మనమీద వుంది. ఆ బాధ్యత నిర్వహించడంలో ఒకభాగమే సెప్టెంబర్ 1990లో విరసం నెల్లూరుజిల్లా యూనిట్ ప్రచురించిన "నేలతల్లి విముక్తి కోసం" జన జీవన పోరాటాల కథాసంపుటి. రచనాకాలం, 1978 నుండి 1988 వరకు అంటే 10 సంవత్సరాల్లో రైతుకూలీలు, గిరిజనులు, కార్మికులు, విద్యార్థులు, మేధావులు, మహిళలు నిర్వహించిన పోరాటాల చరిత్రే ఈ "నేలతల్లి విముక్తి కోసం".

సృజన, అరుణతార, రాడికల్ మార్చ్ పత్రికల నుండి 4 విప్లవ సాహిత్య కథా సంపుటాల నుండి, చతుర మాసపత్రికనుండి తీసుకొని 428 పేజీల్లో కూర్చిన "నేలతల్లి విముక్తి కోసం" కథా సంపుటిలో 41 కథలున్నాయి. ఈ కథల్లో పేర్కొనబడిన వేలాదిమంది ప్రజలు నిర్వహించిన పోరాటాలకు స్పష్టంగా నూతన ప్రజాస్వామిక విప్లవ లక్ష్యం వుంది. మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం తాత్విక దృక్పథంగా వుంది. ఈ పోరాటాల వెనుక ఎందరో వీరులు చిందించిన రక్తం వుంది. ప్రాణం కంటే మిన్న ఆశయమని నమ్మిన ఎందరో వీరుల నాయకత్వంలో నడిచిన లక్షలాది ప్రజల త్యాగాలున్నాయి.

విప్లవం అంటేనే త్యాగాలతో కూడుకున్నది. ఎందరో నేలతల్లి విముక్తి కోసం తమ రక్తాన్ని ధారపోశారు. వీరందరిలో మహిళలు ఒక విడదీయలేని భాగం. ప్రజా పోరాటాల్లో భాగంగా మహిళలు కదిలారు. తమ హక్కుల కోసం, తమ సమస్యల పరిష్కారం కోసం మహిళలు పోరాటాలు చేశారు. వాళ్ళపై జరిగే ఆర్థిక రాజకీయ సాంస్కృతిక దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాల్లో వాళ్ళ త్యాగాలు, వీరత్వం, గుండె నిబ్బరం ఎలాంటివో యీ కథా సంపుటిలోని కొన్ని కథలు ప్రత్యేకంగా తెలుపుతాయి.

ఈ కథా సంపుటిలోని 10 కథల్లో మాత్రమే మహిళల పాత్ర గురించి కొంత ఎక్కువగా చెప్పారు. మరికొన్ని కథల్లో నామమాత్రంగా మహిళల పాత్రల్ని పరిచయం చేశారు. కథాచిత్రణలో ఆయా రచయితలు మహిళల ప్రాముఖ్యతని చిత్రించవలసినంతగా చిత్రించలేదనే చెప్పవచ్చు. ఎందుకంటే, పోరాటాలు ప్రారంభమయినప్పటినుండి నేటివరకు మహిళలు లేకుండా ఏ వుద్యమం ముందుకు సాగలేదు.

ఆంధ్ర దండకారణ్యాలల్లో జరిగిన ప్రతిపోరాటంలో, వుద్యమంలో మహిళలున్నారు. కొన్నింటిలో మహిళలదే ప్రత్యేకపాత్ర. సామాజిక మార్పుకోసం, మహిళా విముక్తి కోసం జరుగుతున్న వర్గ పోరులో పీడిత వర్గాల మహిళలు చోదక శక్తుల్లో ఒక భాగంగా నిర్వహించిన పోరాటాల గురించి, చేసిన త్యాగాల గురించి సభ్య సమాజానికి నొక్కి చెప్పడమే నా యీ వ్యాసం లక్ష్యం. తద్వారా రానున్న పెను విప్లవ పోరాట తుఫానుల్లో మహిళలు నిర్వహించనున్న పాత్రని వీక్షించడానికి యీ వ్యాసం కొంతైనా తోడ్పడుతుందనీ ఆశిస్తాను.

జనరల్‌గా వుద్యమ అభివృద్ధి క్రమాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రచురణకర్తలు యీ కథా సంపుటిని కూర్చినా, వాస్తవ జీవితంలో కథాసంఘటనలు జరిగిన కాలాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ వ్యాసంలో 10 కథల్లోని మహిళల పాత్రల్ని మీ ముందు వుంచుతున్నాను.

1) ఎత్తిన పిడికిళ్ళు : కామ్రేడ్ 'చుక్క' రాసిన 'ఎత్తిన పిడికిళ్ళు' కథ, వుద్యమ ప్రారంభ కాలం నాటిది. ఇది కథ కాదు. కరీంనగర్ జిల్లా సిరిసిల్లా తాలూకాలోని తిమ్మాపూర్ గ్రామంలో 1977లో జరిగిన బతుకమ్మ పండగ నాటి వాస్తవం.

సామాజికంగా ఆర్థికంగా రాజకీయంగా దొరలు ఏ విధంగా దోచుకుంటున్నారో, ఎలా జులుం చేస్తున్నారో, పార్టీ ప్రజలకు అర్థం చేయిస్తూ, పోరాట బాటల్లోకి ప్రజలను పయనింప చేస్తున్న కాలం అది. ఆచార వ్యవహారాల పేర్లతో ప్రజలలో వున్న అమాయకత్వాన్ని ఆసరా చేసుకొని స్త్రీలను సాంస్కృతికంగా అణచడం, కంటికి నదురుగా కన్పించిన ప్రతి స్త్రీని దొర తన సొత్తు చేసుకోవడం నిత్య కృత్యాలు. అలా కాని పక్షంలో ఆ స్త్రీలు కానీ, వారి కుటుంబాలు కానీ, బతికి బట్టకట్టడానికి వీలులేదు. అలాంటి సాంప్రదాయం ఆనాడు కరీంనగర్ జిల్లాలోనే అనేక గ్రామాల్లో వుండేది.

బతుకమ్మ పండగ, ప్రత్యేకంగా స్త్రీల పండగ. పూలతో అందంగా బతుకమ్మలు పేర్చి, ఒకచోట పెట్టి, చుట్టూ తిరుగుతూ స్త్రీలంతా పాటలు పాడుకుంటూ ఆడుతారు బతుకమ్మ పండగ రోజు. ఆ వూళ్ళోని ఆడవాళ్ళందరు దొరోరి సావిట్ల బతుకమ్మలాడటం ఆచారంగా వుందని 'ఎత్తిన పిడికిళ్ళు' కథ చెబుతుంది. బతుకమ్మలాడ వచ్చిన స్త్రీలతో దొర అసభ్యంగా మాట్లాడటం, కంటికి నదురుగా కన్పిం

చిన స్త్రీని తన సొత్తు చేసుకోవడం యిలా దొర పెత్తనానికి ఆ రోజుల్లో అడ్డు వుండేది కాదు. సంఘం గ్రామంలో ప్రవేశించి, తన కార్యకలాపాలు ప్రారంభిస్తుంది. అందులో భాగంగా, తరతరాలుగా బత్కమ్మ ఆచారం పేరుతో దొర చేస్తున్న జులుంకు సవాలుగా, 'స్త్రీలు దొర యింటిముందు బతుకమ్మలాటను బందుపెట్టి ఎవరి వాడలో వారు బత్కమ్మలాడాలని' సంఘం పిలుపు యిస్తుంది. ఈ పిలుపు స్త్రీలలో ఉత్తేజాన్ని కల్గిస్తుంది . అప్పుడప్పుడే స్త్రీలు దొరల జులుంకు వ్యతిరేకంగా కదులుతున్నా, యింకా వాళ్ళలో వున్న భయంవల్ల, మూఢవిశ్వాసాల వల్ల ముందు కొంత సంశయించినట్టు కన్పించినా, దొర వీళ్ళను చూసిన చూపు, వాళ్ళపట్ల వ్యవహరించిన తీరు వాళ్ళ హృదయాలలో రేగుతున్న కసికి అడ్డంకులన్నీ మంచువలె కరిగి, చివరికి దొర సావిట్లో బత్కమ్మలాడటాన్ని బహిష్కరించి, పోశాలుతాత యింటిముందు ఆడుకుంటారు.

ఈ కథలో సంఘ కార్యకర్త మల్లయ్య భార్య పేరు ఈరమ్మ. ఈరమ్మ యింటి పక్కామె పేరు లస్మమ్మ. దొర యింటిముందు బత్కమ్మలాట ఆడకూడదనీ సంఘం సాటింపు వేస్తుంది. ఆ సాటింపు విన్న ఈరమ్మ, లస్మమ్మలు తరతరాల ఆచారాలను వ్యతిరేకిస్తే ఏమవుతుందోనని మాట్లాడుకుంటారు. లక్మమ్మ ఈరమ్మతో యిలా అంటుంది- "ఈయ్యేడు బత్కమ్మలాట దొరోరి సావిట్ల ఆడద్దట! ఆ సంఘపోల్లు సాటింపు చేస్త్రాను. ఈ సంగపొల్లగాండ్లకు పిస్స లేసినట్టున్నది. తాత ముత్తాతల్నుంచి అత్తున్నది ఒక్క రోజుల కుదిరి కూసుండమంటే కుదుర్తాది"

"ఇన్నవా? వాకొడుకేల జేసిండో, సంఘపొల్లేం జేత్త్రరో" అన్నది లస్మమ్మ. ఆ మాటలు విన్న ఈరమ్మ "సాల్లె సంబురం! ఎంత సంగుపొల్లయితేంది ఆసారాన్ని కాదంటామా? అయినా ఈనెకు ఎంత జెప్పినా ఇనడత్తా ఆ సంగంల వుండుడెందుకు? దొరోరి కంట్లె పడుడెందుకూ" అంటుంది. ఇలా ఆలోచిస్తున్న ఈరమ్మ గతాన్ని గుర్తుకు తెచ్చుకుంటుంది. తనకు కొత్తగా పెళ్ళయినేడు, అయ్య దోల్కపోవచ్చినా, అత్తమామల్దోల లేదు. తన భర్త బొంబాయికి పోయె. ఆనాడు దొర యింటి ముందు బతుకమ్మలాడ బోయినపుడు దొర ఏమన్నడు? "ఏందె! నీ మగన్కి సంపాదన గట్టి ఎక్కువయ్యిందా ఏంది? అపుగానీ మొగడు బొంబాయికి బోయిండేమో? ఈ సుక్కల సీరా ఆడే బంపిచ్చిండా-లేకుంటే ఎవ్వడన్నా కొనిచ్చిండా! ఎందుకంటే! ఆడ సంపాదన ఆనికే సరిపోతలేదట గద తెల్లార్లేత్తే ఎద్దుగుద్ద బొడ్సుకునే దానివి మొగుదేడ్నో బొంబాయిలుండెనా నీకీడింత సోకులెందుకే....?" ఆ మాటలు ఈరమ్మ

యూనీకి తెప్పుకుని గుడ్లల్ల నీరు నింపుకుంటుంది. తరతరాల ఆచారాలు కాదంటే ఏమవుతుందోనన్న భయం-మళ్ళీ అంతలోనే తమకు జరిగిన అవమానాలకు వ్యతిరేకంగా ఎదిరించాలనే పట్టుదల రెంటి మధ్యన మానసిక ఘర్షణ!

ఈ కథలో ఈరమ్మ, దొర పాలేరు కొంరని సెల్లెలు పాత్రలద్వారా ఈ ఘర్షణ తెలుస్తుంది. ఒక్క ఈరమ్మో, కొంరని సెల్లెలో దొర చేతిలో అవమానాల పాలు కాలేదు. గ్రామంలోని స్త్రీలందరూ ఏదో విధంగా యిలాంటి అవమానాలు పొందినవారే, అయితే గ్రామంలోని ఈ స్త్రీ పాత్రలు ఆ గ్రామంలోని స్త్రీలందరికి ప్రాతినిధ్యం వహిస్తాయి. తరతరాలుగా ఆచారాల పేరుతో జరుగుతున్న అవమానాలకు వ్యతిరేకంగా సంఘ నాయకత్వంలో ఆ గ్రామ స్త్రీలందరూ సంఘటితంగా దొర గడిముందు బతుకమ్మలాడటం బంద్‌చేసి మరోచోట ఆడుకుని, దొరతనంపై తొలి విజయం సాధిస్తారు. అప్పుడే వాళ్ళలో గూడు కట్టుకున్న సంఘటిత చైతన్యానికి యిది నాంది పలికింది.

ఈ విజయం తర్వాత, దసరా పండగ సందర్భంగా దొరతనం మరోసారి ఓడిపోయి సంగానికి మరొక విజయం లభిస్తుంది. సంఘటిత శక్తిపట్ల పోరాటంపట్లా ఈరమ్మకు పూర్తి నమ్మకం కుదరలేదు. దొరతో పోరాటం వద్దని భర్తకు తన భయాన్ని తెలియజేస్తుంది. ఈరమ్మ భయపడినట్లే దొర విసిరిన పంజా సంఘ నాయకుడు మల్లయ్య ప్రాణాన్ని తీస్తుంది. దీర్ఘకాలికపోరాటంలో గెలుపు-ఓటమి-అంతిమ విజయం వరకు సాగే క్రమంలోని ప్రారంభ దినాల్లో ప్రజలు ఎలా ఆలోచిస్తున్నారనేదానికి స్పష్టమైన వుదాహరణే యీ కథలో ఈరమ్మ పడిన ఘర్షణ. ప్రజాపోరునాపాలనీ తిమ్మాపూర్ (1977 సెప్టెంబర్)లో కామ్రేడ్ లక్ష్మిరాజంని దొరలు చంపారు. అయినా, యిలాంటి అత్యాచారాలు పీడనలు సహించమంటూ హత్యలు ప్రజా వుద్యమాన్ని ఆపలేవంటూ మరొక అడుగు ముందుకు వేయటానికి ఆనాడు అక్కలంతా ముక్తకంఠంతో పిడికిళ్ళెత్తుతారు.

2) సంఘం : కామ్రేడ్ అల్లం రాజయ్య రాసిన సంఘం కథ, 1978లో కరీంనగర్ జిల్లాలో ప్రారంభమైన ప్రతి పూరి రైతాంగ పోరాటానికి, ఉద్యమ విస్తరణ సందర్భంగా ప్రతి గ్రామ అనుభవానికి ప్రతిరూపం.

'సంఘం' కథలో - దొర ఆ గ్రామంలోని రైతు కూలీ లచ్చిం మల్లయ్య

భూమిని అక్రమంగా ఆక్రమించుకుంటాడు. లచ్చిం మల్లయ్య దొరకు ఎదురు తిరుగుతాడు. ప్రజల ఆధ్వర్యంలో ప్రజా పంచాయతి నిర్వహించబడుతుంది. సంఘం గ్రామాల్లో ఏర్పడక ముందు పంచాయతి దొరల చేతుల్లో ప్రజల నణిచే ఒక ఆయుధంగా వుండేది. పంచాయతిలో దొర చేసే అక్రమానికి హద్దులేదు. కుటుంబంలో మామూలుగా జరిగే తగాదాలకు కూడా దండుగ కట్టించుకునేవాడు. దొంగ ఖాతాలు రాసి దొర ప్రజల భూముల్ని కబ్జా చేసుకునేవాడు. ఎప్పుడైతే ప్రజలు సంఘటితమయ్యారో ప్రజా పంచాయతి ప్రజల చేతుల్లో ఆయుధమై దొరలను నిలదీసింది. దండుగలు లంచాలు వాపస్ కక్కించి దొరలకు శిక్షలు, జరిమానాలు విధించింది. ఆ కార్యక్రమంలో భాగమే లచ్చిం మల్లయ్య పొలం అతనికే చెందాలని ప్రజా పంచాయతి నిర్వహించబడుతుంది. పంచాయతిలో ప్రజలు తమ అభిప్రాయాలను చెబుతారు. అందులో ఒక యువకుడు బానయ్య "దున్నేటోన్కే భూముంతాలె" అంటాడు. అప్పుడు.... "అన్ని ఒక్కసారే అత్తయా ? ఎనకా ముందు ఇసారం సేయద్దా ?" అంటాడు దొర. ఆ మాటలు విన్న రాయమల్లు (మహిళ) కోపంగా తన సహజ ధోరణిలో "ఏందయ్య సూసేటిది ? మా దండి పెద్ద మొగోల్లు, తునికాకుల కోతలప్పుడు కట్టకు ఏకానియ్యమంటె గిట్లనే నీల్గ లేదా ? ఏకానకు మూడు జోడాలేసుకుంటననె - అని సొమ్మేం బోయింది ? రాల్లల్ల, రప్పల్ల చెట్టు-చెట్టుకు తిర్గి కొమ్మ-కొమ్మకు పాకి ఆకులు కోస్కత్తే లేతాకనే, మచ్చలాకనె, ఆకరికత్తె గాలికి తూరుపాల బట్టి పందిరి మీన ఇసురేసుకునె, ఉల్వ కట్టల కోసం జూసె - ఆఖరుకు దిగచ్చిండా లేదా ? ఎక్కువ తక్కువ మాట్లాడ్తె ఎండిన కట్టలు కల్ల మీనియి ఎవలయాళ్ళ కట్టుక పోతామని ఎగబడితే - అప్పుడు రోగం దిగ్గి అన్నంత పారేసిండు, అడుగంది అవ్వయిన వెట్టది- ఇంతమందుండంగా గ ఈశ్రెడ్డి పటేలు మొగులు మీదికెగిరి పోతడా ? గట్ల సాతగాక పోతే గాజులు పెట్టించు కోరాదుండ్రి" అని చేతులు తిప్పుకుంటూ చెప్పింది.

దొర చెర నుండి లచ్చిం మల్లయ్య భూమిని తీసుకోవటానికి సంగం వాళ్ళు వెనుక ముందాడుతున్నారని గ్రహించిన రాయమల్లు, వర్గ కసి నిండిన తన సహజమైన రైతాంగ స్త్రీ ధోరణిలో పై విధంగా మాట్లాడుతుంది. రాయమల్లు పోరాటం ద్వారా తన అమాయకత్వాన్ని, భయాన్ని పోగొట్టుకున్న రైతాంగ స్త్రీ. సంఘటితమై తెగించి పోరాడితే భూమి స్వాధీనం చేసుకోవటం సాధ్యమని చెబుతూ, అప్పటికే

తునికాకు పోరాటం చేసి విజయం సాధించిన అనుభవాన్ని గుర్తు చేస్తుంది. గత అనుభవం నుండి గుణపాఠం తీసుకొని పోరాడుమని ప్రోత్సహిస్తుంది. ప్రజలు తమ స్వంత అనుభవం ద్వారా విప్లవాన్ని నడపడం నేర్చుకుంటారనే వాస్తవాన్ని రాయ మల్లు మాటల ద్వారా పాఠకులు తెలుసుకుంటారు. సంగం ప్రజా పంచాయతి జరిపి దొర నుండి భూమిని లాగి లచ్చిం మల్లుకు స్వాధీనం చేయడం ద్వారా రాయమల్లు మాట్లాడినట్టుగా మరో విజయం సాధిస్తారు.

3) కుంపటి : కామ్రేడ్ అందుసల మొండయ్య రాసిన 'కుంపటి' కథా వస్తువు 1978 సెప్టెంబర్‌లో కరీంనగర్ జిల్లా చిన్న మెట్‌పల్లి గ్రామంలో జరిగిన వాస్తవ ఘటనల నుండి తీసుకోబడింది.

తెలంగాణా పల్లెల్లో ఒక పల్లె 'ఆదివారప్పేట' తెలంగాణా పల్లెల్లోని కర్కోటక భూస్వాముల్లో ఒకడు 'రంగారావు' దొర. ఆదివారప్పేట దొర పేరే రంగారావు.

ఆదివారప్పేటకు పక్కనే గల గ్రామాల్లో దొరలకు వ్యతిరేకంగా రైతాంగ పోరాటాలు ప్రారంభమవుతాయి. ఈ పోరాటాల ప్రభావం ఆదివారప్పేట రైతాంగంపై పడింది. ఒక సభ (1978 సెప్టెంబర్ జగిత్యాల రైతుకూలీల జైత్రయాత్ర)ని చూసి వెళ్ళిన ఆదివారప్పేట రైతుకూలీలు రంగపురం సంగ నాయకుల మద్దతుతో సంగం పెట్టుకుంటారు. అప్పుడే దొర మనుషులు దుడ్లు పట్టుకొని సంగం మీద పడతారు. చేతుల్లేమి లేకుండిన రైతుకూలీలు సొడ సొడ నెత్తుర్లు గారంగ పురుకుతారు. రంగపురం సంగ నాయకుడు రామేశంతో పాటుగా మరో నలుగురు రైతు కూలీలు దొరికిపోతారు. దొర గుండాలు వూరిమీద పడి దౌర్జన్యం చేస్తారు. పట్టుకున్నోళ్ళను బాగా కొడుతారు.

రాత్రికి రాత్రే పక్కనే గల వూళ్ళన్నింటికి వార్త తెలుస్తుంది. గ్రామ ప్రజలు దొరపై సాంఘిక బహిష్కరణ ఆయుధాన్ని ప్రయోగిస్తారు. తెల్లారే సరికల్లా ఆదివారప్పేట సంగానికి మద్దతుగా చుట్టుపక్కల సంఘాలన్నీ కదులుతాయి.

"దున్నేటోనిదే భూమి"
"రంగారావు దౌర్జన్యం నశించాలె"
"పట్టుకున్న రైతులను విడిచిపెట్టాలె ..."
"...................."

వందలు వేలుగా జన ప్రభంజనం కదిలి వస్తుంటే, ధూళి ఆకాసాని కంట లేసింది. ఆదివారప్పేట జనం స్త్రీలు పురుషులతో సహా చిన్నా పెద్ద అనే తేడా లేకుండా అందరు ఆ మందల కలుస్తారు. పాటలు-కేకలు - పెడబొబ్బలు మార్మో గగా గుతుపలు గొడ్డండ్లు ములుగర్రలు చేబూని వీరావేశంతో దొరగడిని చుట్టు ముడతారు. యుద్ధరంగంలోని వీర యోధుల్లా రైతు కూలీలు దొరని సవాలు చేస్తారు.

జన ప్రభంజనాన్ని చూసి వణికిన దొర ప్రజలపై తుపాకితో కాల్పులు జరుపుతాడు. తుపాకి కాల్పులు ప్రజలనాపలేక పోతాయి. వాళ్ళలో కసి రెట్టింపవు తుంది. కాల్పుల మధ్యనే గడిలోకి ప్రవేశించి తమ సహచరుల కట్లు విప్పుతారు. ఆ కాల్పుల్లో భీమయ్య నేలకొరుగుతాడు. మరెందరో గాయపడతారు. చేతికందిన రాళ్ళతో జనం ప్రతిఘటిస్తుంటారు. ఇంతలో దొర కావలి కుక్కలైన పోలీసులు రంగప్రవేశం చేస్తారు. పోలీసులు చూస్తుండగా బంగ్లపై నుండి దొర తుపాకితో కాల్పులు జరుపుతూనే వుంటాడు. ఇది గమనించిన 'ఒక స్త్రీ' పరిగెత్తుకుంటూ అమీను జీపు దగ్గరికి పెళ్ళి యిలా అంటుంది. "అచ్చింర్లా ...వాడు సూడుండ్లి బాంచెన్ గింతమంది మా మొగోళ్ళ పిట్టల గాల్సినట్టు కాలుత్తాండు....నీ బాంచెన్ మీ కాడ గా తుపాకులున్నయ్ వాళ్ళకు ఎదురు సెప్పుండ్లి లాకపోతే అపుమని సెప్పుండ్లి".

ఆ మాటలు అమీను చెవుల కెక్కదు. పైగా "రైతులారా ప్రశాంతంగా ఉండండి - లేకుంటే కాల్పులు జర్గుతయి...." అని మైకులో మొరుగుతాడు. ఆ మాటలు విన్న ఆ స్త్రీ "నీ బాంచెన్ తమరు గదే మాటంటారా", "వాన్ని అరెట్టు సెయ్యుండ్రి బాంచెన్, సత్తండ్లు బాంచెన్ సత్తండ్లు" అని గొంతిక తెగి పోయేటట్టు అరుస్తుంది. తమ వాళ్ళను బతికించుకోవాలని ఆమె పడే తపన అది. అయినా అమీను విన్పించుకోకుండా మళ్ళీ "రైతులారా ప్రశాంతంగా...." వుండండంటుండ గానే, ఆ స్త్రీ వుగ్ర నరసింహమూర్తి వలె ముందుకురికి "ఓరీ నీ సాపు నిర్సాపు గాను- నా సీరే గాజులు నువ్వు తొడుక్కోరాదు గ బట్టలు నాకియ్యి. తుపాకి నా సేతి కియ్యి - అన్ని అరెట్టు సేత్తా" అంటూ కాండ్రించి ఉమ్మింది.

"జనం పోలీసోల్ల దిక్కు తిరిగిండ్రు-

మీరు ఆనికి మద్దతచ్చింర్లా

తన్నుంద్రి ఈళ్ళు ఆళ్ళ బంప్లే...."
పోలీసుల తుపాకులు గాలిలో మొరిగినయ్"

ఈ కథలో దొర జులుంకు వ్యతిరేకంగా పోరాటం సాగించిన ప్రజలపై తుపాకితో కాల్పులు జరుపుతాడు- దొర కావలి కుక్కలైన పోలీసులు తుపాకులతో వచ్చినప్పటికీ దొరను ఆపకపోగా, తుపాకులను గాలిలో పేల్చి ప్రజలను భయభ్రాంతులను చేస్తారు. మొదట దొర ప్రజలపై కాల్పులు జరుపుతున్న సందర్భంగా, ఒక స్త్రీ అమీనుతో మాట్లాడిన మాటలు - పోలీసులు కప్పుకున్న మేలి ముసుగును అర్థం చేసుకోక మాట్లాడినవే. దొరా, పోలీసులు ఒకటేనని కొన్ని నిమిషాల్లోనే ఆచరణాత్మకంగా తెలుసుకున్న ఆ స్త్రీ (వాస్తవ జీవితంలో) నాయకత్వంలో ప్రజలు పోలీసులపై పడతారు. దొర ప్రజలపై జరిపినట్లుగానే పోలీసులు తమ తుపాకులను జనంపై ఎక్కుపెట్టి బెదిరిస్తూ గాలిలో కాల్పులు జరుపుతారు.

నిరాయుధులైన తమపై పోలీసులు తుపాకు లెక్కుపెట్టగా దొర జరిపిన కాల్పుల్లో తమ సహచరులు ఒక్కొక్కరే గాయపడి నేల గూలినా ఆ పోరు అంతటితో ఆగలేదు. ఆ 'కుంపటి' చిటపట - పటచిట రగులుకుంది. ఆ స్త్రీ రాజ్యాంగ యంత్రాన్ని ధ్వంసం చేసే దిశగా సాగిపోతోంది. నేడు వుత్తర తెలంగాణాలో ఆ స్త్రీ రాజ్యాంగ యంత్రాన్ని ధ్వంసం చేయటానికి రైఫిల్ చేబూని పోరాడుతుంది.

4) ఇంద్రవెల్లి : వసంతదేశ పాండేగారు రాసిన "అడవి" నవల నుండి కొంత భాగాన్ని తీసుకొని, 13వ కథగా 'నేలతల్లి విముక్తి కోసం' లో ప్రచురించారు. ఈ కథలో ఇంద్రవెల్లి పోరాటం గురించి వర్ణించారు. ఇందులో సాహసవంతమైన స్త్రీల పాత్ర వుంది.

అది 1981 ఏప్రిల్ 20 వ తేది. అది విప్లవోద్యమ చరిత్రలో ఒక రక్తసిక్త ఘట్టం. తమ ప్రజాస్వామ్య హక్కుల కోసం పోరాడుతున్న గిరిజనులు, తమ సభా హక్కుని కాలరాచిన ప్రభుత్వంతో సవాలు చేసిన రోజది. కిరాతక ప్రభుత్వ సాయుధ బలగాలను తమ సంప్రదాయక పనిముట్లతో ఎదుర్కొన్న రోజది. అది నరసంహారానికి జలియన్‌వాలాబాగ్‌ని స్ఫురణకు తెచ్చేది మాత్రమే కాదు - సామూహిక హత్యాకాండకు తలపడిన పోలీసుల్లో ఒకడి తలను నేల కూల్చి, బాహాబాహి ప్రతిఘటనకు దిగిన గిరిజన స్త్రీల - పురుషుల వర్గపోరు సంకేతమది.

గిరిజనులు ఇంద్రవెల్లిలో సభ పెట్టుకోవటానికి అనుమతి కోరుతూ పోలీసు అధికారులకు వారం పది రోజుల ముందే దరఖాస్తు పెట్టుకుంటారు. అధికారులు అనుమతి ఇచ్చినట్టే యిచ్చి ఇంద్రవెల్లిలో నిషేధాజ్ఞలు విధిస్తారు. "ఇంద్రవెల్లిలో నిషేధాజ్ఞలు విధించిన సంగతి అడవిలోతట్టు గూడాలకు తెలియదు. మరోవైపు తెలిసిన వాళ్ళ గుండెలు ఆవేశంతో, కోపంతో ఎగిరి పడుతున్నాయి. కొందరు అగ్ని పర్వతంలా బద్దలయ్యారు. స్త్రీలు రుద్రకాళుల్లా నిలబడి పోయారు. ఈటెలు చేత పట్టుకున్నారు. చూర్లకు చెక్కి వున్న తూటు కొమ్ములను తీసుకొని ఊదసాగారు. అలా మూలన పడివున్న తూటు కొమ్ములన్నీ ఒక్కసారిగా మొగసాగాయి. ఆవేశం పట్టలేక బలంకొద్దీ తుడుం వాయిస్తున్నారు. ఆ ధ్వనితో గూడాలు దద్దరిల్లి పోతున్నాయి".

"తుడుం మోత విని - తింటున్న వాళ్ళు తిండి వదిలేసి, పాలిస్తున్న తల్లులు బిడ్డ నోట్లోంచి రొమ్ము లాగేస్తూ — ముసలివాళ్ళు కర్ర ఆసరాగా నిలబడుతూ— పడుచువాళ్ళు, ఆడవాళ్ళు మగవాళ్ళు చేతికి ఏది దొరికితే అది అందుకొని — పిల్లలు కింద పడి వున్నరాయి చేత పట్టుకొని—తుడుంమ్మోగిన దిక్కు ప్రవాహంలా కదులుతున్నారు".

"వందల సంఖ్యలో పోలీసులుంటే వేల సంఖ్యలో గిరిజనులు. క్షణ క్షణానికి పరిస్థితి (పోలీసు అదుపు దప్పుతోంది. ముంజల్లాగా చుట్టుముడుతున్నారు జనం. దినమంతా కలసి కనీసం నలభై సార్లయినా లాఠీఛార్జీ చేసి వుంటారు. కాని వాళ్ళు వెనక్కి తగ్గటం లేదు. మరింత ముందుకే వస్తున్నారు".

లాఠీఛార్జీ జరిపినప్పటికి, తమ ప్రజాస్వామిక హక్కు కోసం మంటల్లాగా చుట్టుముడుతున్న గిరిజనులపై పోలీసులు కాల్పులు జరిపారు. ఆ కాల్పుల్లో కొందరు నేల కొరుగుతూ వుంటే, మిగతావారు ప్రతిఘటిస్తున్నారు. పోలీసు కాల్పులకు భయపడి నిస్సహాయంగా స్త్రీలు ఏడుస్తు పరిగెత్తలేదు. తమలో కోపాగ్ని జ్వాలలు రగులుతుండగా ఒక గోండు స్త్రీ కొడవలితో పోలీసును నరికి చంపుతుంది. పోలీసులు సామూహిక హత్యాకాండ ద్వారా ఇంద్రవెల్లి సభని భగ్నం చేశారు. గోండు గుండెల్లోని ప్రజాస్వామిక పోరు జ్వాలల్ని తుపాకీతో ఆర్పేయించానని కల్లై సర్కారు సంతోషించింది.

కాని, ఇంద్రవెల్లి పోరాటం నుండి పాఠాలు నేర్చుకున్న అక్కలు చెల్లెళ్ళు కొడవండ్లకు బదులు బందూకులు పడుతున్నారు. అన్నలు అక్కలు గుతపలు గొడ్డండ్లకు బదులు రైఫిళ్ళు పడుతున్నారు. రాళ్ళు చేపట్టిన పిల్లలు బాంబులు పడుతున్నారు. చెదలు పట్టిన ఈ వ్యవస్థను సమూలంగా మార్చటానికి ఇంద్రవెల్లి మార్గం చూపింది. ఈ మార్గంలో నేడు దండకారణ్యం మండుతోంది. దండకారణ్యంలో బందూకులు చేబూని అక్కలు కదం తొక్కుతున్నారు.

(ముందుగా గిరిజనులు ఒక పోలీసును చంపిం తర్వాత పోలీసులు కాల్పులు జరిపి అనేక మందిని చంపారని వసంత దేశ్‌పాండే గారు రాశారు. ఇది వాస్తవం కాదు. పోలీసు రికార్డుల్లోనే యిలాంటి ఆరోపణ వుంది. పోలీసుల లాఠీ ఛార్జీని గిరిజనులు తిప్పి కొట్టడంతో పోలీసులు కాల్పులు జరిపారు. గిరిజనులు ఈ కాల్పుల్ని సైతం తిప్పి కొట్టడంతో ఒక పోలీసు కుక్క చాపు చచ్చాడు. పాఠకులు యీ సవరణని గమనించగలరని కోరుతున్నాను)

5) నీళ్ళ తగవు : కామ్రేడ్ తుమ్మేటి రఘోత్తమ రెడ్డి రాసిన యీ కథని సృజన మే 82 సంచికలో ప్రచురించారు. సింగరేణి బొగ్గు బాయిలకు ఎంత చరిత్ర వుందో, నీళ్ళ తగవుకు అంతే చరిత్ర వుంది. 1981 నుండి 'సికాస' నాయకత్వంలో యిలాంటి తగవులెన్నో నిర్దిష్ట లక్ష్యంతో జరుగుతున్నాయి.

ఒక ప్రక్క రైతాంగం భూ పోరాటాలు చేస్తూ వుంటే అడివి హక్కుపై గిరిజన రైతాంగం వుద్యమిస్తూ వుంటే మరొక ప్రక్క సింగరేణి బొగ్గుగని కార్మికులు కంపెనీ యాజమాన్య దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా, అభివృద్ధి నిరోధక, రివిజనిస్టు ట్రేడ్ యూనియన్ నాయకత్వ విద్రోహానికి వ్యతిరేకంగా పోరాటాలు నిర్వహించారు. 1981లో సింగరేణి కార్మికులు సమ్మె చేస్తే దక్షిణ మధ్య రైళ్ళు ఆగిపోయాయి. సమ్మెతో కార్మికుల శక్తేమిటో శత్రువుకు తెలియవచ్చింది. ఇలాంటి ఎన్నో పోరాటాలు సింగరేణి కార్మికులు నిర్వహించారు. ఈ పోరాటాల వెనుక ఎందరో కార్మిక వీరుల రక్తతర్పణం వుంది. ఈ పోరాటాలకు చలనశక్తిగా కార్మికుల్లో విప్లవ చైతన్యం వుంది. ఈ పోరాటాల వెనుక ఎందరో కార్మిక స్త్రీల చైతన్యశక్తి వుంది.

నీళ్ళ తగవు కథలో-సింగరేణి కార్మికులు ముఖ్యంగా అక్కడి కార్మిక స్త్రీలు

పోరాటంచేసి నీటి సమస్యను ఎలా తొలగించుకున్నారో రచయిత వివరించారు. సాధారణంగా కార్మికుల జీవన పరిస్థితులు చాల అధ్వాన్నంగా వుంటాయి. చిన్న-చిన్న గుడిసెల్లో ఇరుకిరుగ్గా సరియైన మరుగుదొడ్లు, నీటి సౌకర్యం లేక వాడంతా మురికిగా వుంటుంది. అది వాళ్ళ బతుకులకు నిదర్శనం. బొగ్గుబాయిల్లో పని చేసి తమ రక్తాన్ని చెమటగా మార్చి యజమానుల ఆస్తులను రెట్టింపు చేస్తున్న కార్మికుల బతుకులకు నీళ్ళు కూడ కరువే. అదే పై ఆఫీసర్లకైతే క్వార్టర్స్, నీళ్ళు, కరెంటు, పిల్లలకు చదువు తదితర వసతులు ఉంటాయి.

నీళ్ళ కరువు గురించి సమ్మక్క (కథలో ఒక కార్మికుని భార్య) ఇలా అంటుంది. "మాదిగోనికి సెప్పు కరువయినట్టు బాయి పనోనికి నీళ్ళ కరువు". తరచు నీళ్ళు దొరకని సమ్మక్క నీళ్ళకోసం క్వార్టర్లోకి వెళ్ళి నీళ్ళు తెస్తుంది అక్కడ జనం ఉండరని. ఒక రోజు హెడ్ ఓవర్ మెన్ ఇంట్లోకి నీళ్ళ కోసం వెళుతుంది. అక్కడ ఆ ఇంటి వాళ్ళతో తగాద పడ్తుంది. తగాదా ఒకర్నొకరు తిట్టుకునే దాక పోతుంది. ఆ ఇంట్లోని 12 ఏళ్ళ కుర్రాడొకడు పరుగున వచ్చి సమ్మక్క కుండలు పగులగొడతాడు. "అసలిక్కడికి రమ్మన్నదెవడే ?" అంటుంది ఆ ఇంటి యజమానురాలు. కుండలు పగలగొట్టటంతో పాటు అహంకార పూరితమైన వారి మాటలకు గుండె ఉడికిపోయి కోపంతో "ఎవడా.... ? నీ మిండెడు". అంటుంది సమ్మక్క.

తన భార్యను ఒక మామూలు కార్మిక స్త్రీ ఇంత మాట అంటుందా ? ఇతరులను తిట్టడమేగాని తిరిగి అన్పించుకోవటం తెలియని ఆఫీసర్ భగవాన్‌రావు ఇంట్లోంచి "బద్మాష్ ముండా అగు మల్లోసారి అంటే నాలుక కోస్తా బాంచోత్" హెడ్ వర్ మెన్ తీర్గనే అన్నడు.

"మల్ల కోసేటోడు మా అత్తడు" గేటు తెరుచుకొని బయటకు వస్తూ అంది సమ్మక్క. కోపం అగని భగవాన్‌రావు సమ్మక్క సిగ అందుకున్నాడు. సిగ అందుకోగానే ఏడుస్తూ తిట్లు మొదలెడుతుంది. అప్పటికే చుట్టుపక్కల నీళ్ళ కోసం వచ్చిన ఆడాళ్ళు, ఇండ్లకు వస్తున్న కార్మికులు కొందరు గుమికూడుతారు.

ఈ సంఘటనతో గుడిసెల వాళ్ళంత ఒక పైపు, క్వార్టర్ల వారంత ఒక పైపు విడిపోతారు. "రేపట్నుంచి ఎవతన్నా నీళ్ళకు ఇటుమొఖాన అత్తే కాళ్ళిరగ్గొడతమ్",

"కుండలు పలగ్గొడతమ్", "తన్ని తలెంటికలు కొరిగిత్తం" ఈ మాటలు విన్న గుడెసె వాసులు ఖగ్గున మండుతారు.

ఇక్కడ సమస్య నీటిదే. తమను అడగక నీళ్ళు పట్టుకోవడం, తాము తిడితే ఎదురు మాట్లాడ్డం, ఇవన్నీ తమ పెత్తనానికి అహంకారానికి అడ్డు కాబట్టే గొడవంతా జరుగుతుంది. ఈ గొడవనే చివరకు గుడిసెల వాళ్ళంత ఒక్కటయ్యేటట్టు చేస్తుంది. తమకు జరిగిన పరాభవానికి గాను క్వార్టర్ల వాళ్ళకు తగిన బుద్ధి చెప్పాలనుకుంటరు.

"అసలు మన గుడిశల్ల నాలుగు పంపులుంటె—గవాడు మనల్ను ముట్టుకునేటోడా....? అంటుంది ఓ సారక్క. "గవి లేకనే కద? వాల్లిట్టం వచ్చినట్టు సేత్తాంర్రు సేపుతాంర్రు" అంటుంది మరో ఆవిడ. "గింత మంది వున్నా ఏం లాభం? నాలుగు పంపులు పెట్టియ్యక పెయిరి అంటుంది ఒకామె మగవాళ్ళ నుద్దేశించి. అలా అనుకుంటూనే ఆ పూటకు నీళ్ళు దూరంగ వున్న బొగ్గుల బాయిల నుండి మోస్తూనే ఓ నిర్ణయానికి వస్తారు. తమ నిర్ణయాన్ని మిగతావారికి చెబుతారు. నీళ్ళు మోసేవారు మోస్తూనే ...వంటలు చేసేవారు చేస్తూనే నిర్ణయాన్ని బలపరుస్తారు. "ముప్పయారు జట్లు కలిసినా మూడు సిగలు కల్విందవు" అనే సామెతను వమ్ము చేస్తూ ముప్పయారు సిగలైన, మూడు జుట్లైన వర్గాలకు అతీతంగా ఏవి వుండవంటూ కార్మిక స్త్రీలంతా ఏకమవుతారు—వందల సంఖ్యలో ఆడవాళ్ళంత కుండలు బిందెలతో ఏ ఒక్క కారును పోనియ్యకుండా రోడ్లపై బైఠాయిస్తారు. ఆఫీసర్లకు వాళ్లు అపరకాళికల్లా అన్పిస్తారు. ఒక ఆఫీసరు "ఎట్లానమ్మా నాల్రోజులు ఓపిక పట్టాలి తొందర పడితే ఎట్లా...." అని అన్నాడో లేదో ఒకామె గయ్....మంటూ ముందుకు వస్తూ ఏజెంటును చూస్తూ...."ఓపికే పట్టావన్నా బాంచెన్, ఓపిక... ఆఁ అదే....? మీరచ్చి నాల్రోజులు గాక ముందే వుంటానికి కోటర్సులు ..." అంటే "పంటెమీద గాలి పంఖాలు" అన్నారు. 'పాయఖాండ్లు' అంటె 'తానాల అర్రలు' అన్నారు. కార్లు అంటే— "మోటారు సైకిళ్ళు" అన్నారు. ఇంక అక్కడ వున్న ఇద్దరు ఆడవాళ్ళు ముందుకు వచ్చి—తమ మొగోల్లు బొగ్గుల బాయిలకు బోయి, మళ్ళి బయటికి వచ్చేదాక బతికి వస్తరో తెలువదనీ, తమ నెత్తురు సెమట చేసి లాగీలకు లారీలు బొగ్గు తవ్వి తీసిన వాళ్ళకు ఎలాంటి సౌలత్ లేదని తమ కసిని మాటలలో వ్యక్తం చేస్తారు. అలా అధికార్లను నిలదీసిన మహిళలు రెండు రోజుల్లోకి నీళ్ళు తమ వాడ

ల్లోకి వచ్చేటట్టు చేస్తారు. కార్మిక మహిళలు సాధించిన విజయం వేలాది కార్మికులకు-కార్మిక స్త్రీలకు గొప్ప ఉత్తేజాన్నిస్తుంది. నీళ్ళ దగ్గర "పోట్లాడుకునేది మనం-మనంకాదు మనమంతా కలిసి అధికార్లతో పోట్లాడాలి అనే చైతన్యాన్ని కల్గించారు అక్కడి మహిళలు. నేడు గనుల్లో ఆరని అగ్ని జ్వాలలుగా రగులుతున్న కార్మికుల పోరాటాలకు నీళ్ళ తగవులాంటి తగవులు యింధనంగా వున్నాయి. కార్మిక స్త్రీల పోరాటం కార్మికులు చేస్తున్న పోరాటాలలో భాగమై యాజమాన్యాన్ని వణుకు పుట్టించే విధంగా అంతిమ విజయం శ్రామిక వర్గానిదే అంటున్నాయి.

6) రక్త పింజెర : ఈ కథని కామ్రేడ్ సాహు రచించారు. అదిలాబాద్ జిల్లాలో గిరిజన రైతాంగ పోరాటంతో చైతన్యవంతమైన ప్రజలు రక్త పింజెరల కోరలు విరుస్తున్నారు.

ఉత్తర తెలంగాణ పోరాటాల విజృంభణతో భూస్వామ్య దోపిడీ వర్గాల పునాదులు బీటలు వారనారంభించాయి. భూస్వాములు పట్టణాలకు పారిపోయి, ప్రభుత్వానికి మొర పెట్టుకున్నారు. ఆనాడు రాష్ట్రంలో మర్రి చెన్నారెడ్డి ప్రభుత్వం విప్లవోద్యమాన్ని అణచివేసి భూస్వాముల మనో నిబ్బరాన్ని కాపాడాలనే దుర్మార్గపు తలంపుతో పాశవిక నిర్బంధకాండకు పాల్పడింది. జగిత్యాల, సిరిసిల్లా తాలూకాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించింది. రైతాంగాన్ని అరెస్టులకు చిత్రహింసలకు గురిచేసింది. తప్పుడు కేసులు బనాయించింది గ్రామాల్లో పోలీసు క్యాంపులు పెట్టింది. ఈ నేపథ్యంలో నిర్బంధాన్నుండి రక్షించుకుని వుద్యమాన్ని మును ముందుకు తీసుకొని పోవడంలో భాగంగా వుద్యమాన్ని అడవి ప్రాంతాలకు విస్తరింప చేయాలని పార్టీ చేసిన ఆలోచనకు ఆచరణ ఫలితమే దండకారణ్య వుద్యమం అడివిలోకి దళాలు వెళ్ళిన ప్రారంభంలో అక్కడి గిరిజనుల బతుకుల గురించి అధ్యయనం చేశారు. షావుకార్ల, కాంట్రాక్టర్ల, ఫారెస్టు అధికారుల, దోపిడీ పీడనల గురించి ప్రజలకు తెలియచేస్తూ, యీ అన్యాయాలకు వ్యతిరేకంగా పోరాటం చెయ్యాలనే చైతన్యాన్ని అక్కడి గిరిజనులకు కల్గించారు.

అడవి ప్రాంతంలోని గోండుల బ్రతుకులు ఎంత అధ్వాన్నంగా వున్నాయో, వాళ్ళు ఏ విధంగా దోపిడి-పీడనలకు గురి అవుతున్నారో 'రక్తపింజర' కథ ద్వారా మనకు అర్థం అవుతుంది. ముఖ్యంగా, ఈ కథ అదిలాబాద్ అడవి ప్రాంతంలోని గోండుల జీవన పరిస్థితులను వివరిస్తుంది. అడవిలో ఎత్తైన కొండల మధ్య నాలుగు

గుడిసెలతో ఒక గూడెం ఉంటుంది. 5, 6 కి. మీ. దాటితే అలాంటిదే మరొక గూడెం. పెద్ద గూడాలైతే 15 గుడిసెల వరకు వుంటాయి. చీకి పోయి శిథిలావస్థలో వున్న గుడిసెలు వాళ్ళ బ్రతుకులకు నిదర్శనం. రాత్రికి నెగళ్ళేసుకొని దాని చుట్టే పడుకుంటారు. కూడు గుడ్డ లేని ఇలాంటి వాళ్ళు దేశంలో కోటానుకోట్లు. ఆ కోటాను కోట్లలో మల్కుబాయి ఒకతి. మల్కుబాయి పాత్ర ద్వారా అక్కడి గిరిజన స్త్రీల బతుకులు, జీవన పోరాటంలో వాళ్ళు పడే వేదన కథలో ప్రధానాంశంగా వున్నాయి. రోడ్డు పనికి పోయిన మల్కుబాయి బండలేపబోతే బండకింద వున్న రక్తపింజర కరచి చచ్చిపోతుంది. ఆమెను కరచింది రక్తపింజెరే, కానీ అక్కడి కాంట్రాక్టర్లు, సూపర్వైజర్‌లు, షావుకార్లు, ప్రతి ఒక్కరు గిరిజనుల పాలిట 'రక్తపింజరలే'. కూలీలకు ముందె డబ్బులిస్తారు. రోగమొచ్చి రొప్పొచ్చి ఎవరైనా పనికి రాకపోతే, వాళ్ళు ఎలాంటి స్థితిలో వున్నా జ్వరం వచ్చి చనిపోవడానికి సిద్ధంగా వున్నా, వాళ్ళను ఈడ్చుకొచ్చి వళ్ళు వాచిపోయేటట్టు బాదుతారు. ఉదాహరణకు : బొజ్జు గూడెంలో ఒకతను జ్వరంతో పనికి రాకపోతే సూపర్‌వైజర్ శర్మ బొజ్జును రప్పించి వళ్ళు హూనం చేస్తాడు. పనికిరానివాళ్ళ పరిస్థితి ఇలావుంటే పనికి వచ్చిన వాళ్ళకు బూతులు, తన్నులు, తక్కువ జీతం- ఇవి వాళ్ళ బ్రతుకులు.

మల్కుబాయి చనిపోయిన తరువాత దోపిడీదార్లకు వ్యతిరేకంగా వాళ్ళలో గూడు కట్టుకొని వున్న పర్వతం బ్రద్దలవుతుంది. ఆ అగ్ని పర్వతం బద్దలు కావడం వెనుక తరతరాల దోపిడీ – పీడన వుంది. మల్కుబాయి చావు సంఘటన వుంది. వీటన్నింటితో పాటు అడవిలోకి అప్పుడప్పుడే ప్రవేశిస్తున్న అన్నల మార్గదర్శకత్వం వుంది.

కథలో-మల్కుబాయి తన భర్తతో తమ బతుకు బతుకే కాదు అంటుంది. తిన తిండి లేక, వంటిమీద గుడ్డలేక, పీక్కుపోయిన ముఖంతో రాత్రి నెగడు దగ్గర పడుకొని నిద్రలేమికో వున్న భర్తతో అధ్వాన్నంగా వున్న తమ బ్రతుకు గురించి మాట్లాడుతుంది. "పేన్కు గూడ పెద్దల మజ్జన్ ఏం జేద్దాం-అందరు సత్తే మనం సత్తం- అందరు బతుకుతే మనం బతుకుతం పేన్కుకు తక్కువ సెయ్యక పోతిమి. సెయ్యి కట్టపడని దినం లేదాయే. అందరు బొంగుపనికి పోతరట-మనం పోదాం వోరిని తీస్కపోదాం. ఇంగేం దిక్కులేక పామె-పంట పోతే పట్టుమని పది కొత్త లిచ్చెటోడు లేకపాయె. సర్కారోడు అప్పిత్తడని కాలుకు కట్ట కట్టకుంట. దిగిరి

సేసిన కట్టం నూ(గ్రూపాయలు ఆడెవడో బేంకు పెద్దలకు లంచమిత్తె ఆ కుక్కల కొడుకు బేంకులకు పోతే మెడలు బట్టి బయటికి నూకె-అంగట్లకు బోతే షావుకార్లే మొ మీకు బేంకులచ్చె పొరకల సార్లచ్చిరని గు(రుమనబట్టె-సావుకాల మచ్చింది". 30 ఏళ్ళైన నిండని ఆ జంట రాత్రి మాట్లాడుకున్న మాట్లివి. "ఊసులాడుకోను వంట్లో సత్తువేది". అడివిలో ప్రతికే ప్రతి ఒక్కరి జీవితం అలాగే వుంటుంది. భార్య భర్తల మధ్య కలయిక ఎప్పుడో, ఎక్కడో. ఏ రాత్రికో గదిలో దూరి భార్య భర్తలు ఊసులాడుకునే మామూలు మైదాన ప్రాంతాల్లోని జీవితాలు కూడా లేవక్కడ. రాత్రి పగలు జానెడు పొట్ట కోసం, మూరెడు గుడిసె కోసం పెంపర్లాడ డమే వాళ్ళ బతుకు. అయితే వాళ్ళకు కోరికలుంటాయి. హాయిగా బతకాలనీ వుంటుంది. కానీ - అడవి అధికార్లు, సావుకార్లు, సూపర్‌వైజర్లు రక్తపింజెర్లలాగా వాళ్ళ బతుకులను బుగ్గి చేస్తుంటే, స్వేచ్ఛగా బతకవలసిన వాళ్ళ జీవితాలకు ఈ రక్త పింజెర్లు సంకెళ్ళయ్యారు. ఆ సంకెళ్ళను తెంచుకోడానికి, రక్తపింజర్లను రక్తం కక్కించడానికి వాళ్ళలో అంతర్గతంగా కసి రేగుతూనే వుంది. మల్కిబాయి చావు వాళ్ళ కసిని రెట్టింపు చేస్తుంది. అడవి అన్నల అండ దోపిడీదార్లను నిలేస్తుంది.

అలా నిలేయడంలో పురుషులతో పాటు స్త్రీలు వున్నారు. తమకు కూలీ తక్కువగా ఇచ్చినందుకు, ఒక స్త్రీ తీసుకున్న డబ్బులు (శర్మ సూపర్‌వైజర్) ముఖాన కొడుతుంది. ఒక్క నయాపైస ఎక్కువ ఇచ్చేది లేదంటు శర్మ వెళ్ళి పోతాడు-కూలీలంత కూలీ పెంచే విషయంలో తలో మాట మాట్లాడుతారు. అప్పుడు అందులో ఒక స్త్రీ సీతిబాయి "అనుకున్న మాట మీద కూలీలెన్నడు ఇయ్యలే- అని తాత సొమ్మా? ఆడేమన్న పున్యానికిత్తాండా? ఇత్తడో సత్తడో సూద్దాం- అనుకున్న కూలీ ఇచ్చేదనుక పనులకు వెల్లద్దు" అంటుంది. మైదాన ప్రాంతాలలో స్త్రీలు ఏ విధంగా అయితే సంఘం ఆధ్వర్యంలో కూలీ పోరాటాలలో ముందుండి పోరాడి కూలీ రేట్లు పెంచుకున్నారో, అడవిలో గిరిజన మహిళలు కూడా ముందు న్నారు అనేది సీతిబాయి పాత్ర తెల్పుతుంది.

పని బంద్ పెట్టిన గిరిజన గూడాలపై పోలీసుల దౌర్జన్యం, లాఠీలు, అరెస్టులు ఈవేవి వాళ్ళను భయపెట్టలేదు. ఇప్పుడు వాళ్ల కళ్లలో మల్కిబాయి చితి మంటలు కన్పిస్తున్నాయి. దెబ్బలతో బాధపడుతూ మూల్గుతున్న బొజ్జా కన్పిస్తు న్నాడు. వందల సంవత్సరాల నుండి ఎందరు మల్కిబాయిలు అలా బలి అయ్యారో,

ఎందరు బొజ్జులు చితికిపోయారో, అది గత చరిత్ర. చరిత్ర గమనాన్ని తమ చేతుల్లోకి తీసుకున్న అదిలాబాద్ గోండుల రక్తపింజరల కోరలు పీకుతున్నారు. నాటి మల్కుబాయి లెందరో సాయుధ దండులో చేరుతున్నారు.

7) గమ్యం చేరేదాక పరుగు పందెం : కరీంనగర్ జిల్లాలో ఒక మహిళా దళం 1984 వేసవిలో నిర్వహించిన ప్రచార క్యాంపెయన్‌కు వాస్తవ చిత్రీకరణే కామ్రేడ్ లక్ష్మి కథనంగా రచించిన యీ "గమ్యం చేరేదాక పరుగుపందెం" కథ. ఇదే పరుగు పందెం ఆనాడు ఉత్తర తెలంగాణా అంతటా జరిగింది. 1984 నిర్బంధం తీవ్రతర మవుతున్న కాలం. ముఖ్యంగా కరీంనగర్ జిల్లాలో వుద్యమ ప్రారంభపు రోజుల్లోనే ప్రభుత్వం రెండు తాలూకాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించింది. చాలా గ్రామాల్లో పోలీసు క్యాంపులు వెలిసాయి. అరెస్టులు చిత్రహింసలు సాగిపోతున్నాయి. విప్లవ ప్రచారం కూడ నిషిద్ధం అక్కడ. అలాంటి నిర్బంధం ఉత్తర తెలంగాణాలోని ప్రతి పోరాట గ్రామంలోను వుంది. నిర్బంధంలో సైతం 'గ్రామాలకు తరలండి' క్యాంపెయన్ నిర్వహించడంలో మహిళా దళం ప్రదర్శించిన విప్లవ స్ఫూర్తికి ఈ 'కథనం' అద్దం పడుతుంది.

విప్లవోద్యమంలోనే విద్యార్థుల పాత్ర అద్వితీయమైనది. 1974 చివర రాడికల్ విద్యార్థి సంఘం (RSU) ఏర్పడింది. అప్పటినుండి నేటివరకు RSU నాయకత్వంలో విద్యార్థులు ఎన్నో పోరాటాలు చేపట్టారు. ఆ క్రమంలోనే RSU రైతాంగ పోరాటాలను బలపరుస్తూ ఎన్నో కార్యక్రమాలను తీసుకుంది. RSU విద్యార్థులెందరో తమకు బానిస చదువులు అక్కరలేదని, ప్రజలే నిజమైన గురువులని గ్రామాలకు వెళ్ళారు. గ్రామ ప్రజలతో నీళ్లలో చేపల్లా కలిసిపోయారు. రైతుకూలీలు భూస్వామ్య దోపిడికి ఎలా గురి అవుతున్నారో దగ్గరుండి చూసారు. ఆ దోపిడీని ఎదిరించాలనే చైతన్యాన్ని వారికి అందించారు. వాళ్ల పిల్లల్లో పిల్లలయ్యారు. వాళ్ళు పెట్టింది తిన్నారు.

RSU విద్యార్థుల్లో స్త్రీలూ వున్నారు. మొత్తంగా చూస్తే, చదువుకునే స్త్రీల సంఖ్య తక్కువే అయినప్పటికి, వుద్యమ ప్రారంభ కాలంలో కొద్దిమంది విద్యార్థినులు వుద్యమంలో చేరారు. దానికి కారణం- నేటి సమాజంలో వాళ్లకున్న పరిమిత స్థానమే. నేటి సామాజిక పరిస్థితుల మూలంగా స్త్రీలు వుద్యమంలోకి రావాలంటే, ముందు పోరాటం ఇంట్లోనే మొదలవుతుంది. ఆడపిల్లలు బయటికి వెళ్లకూడదని

దగ్గరినుండి, అసలురాజకీయాల్లోనే స్త్రీలుపాల్గొనకూడదనిచిత్రీకరించింది భూస్వామ్య సంస్కృతి. స్త్రీ ఒక్క అడుగు ముందుకు వెయ్యాలంటే ఎంతో పోరాడవలసి వస్తుంది. ఇలాంటి పరిస్థితులలో సామాజిక కట్టుబాట్లను తెంచుకొని, పీడిత ప్రజల విముక్తితోనే తన విముక్తి ముడిపడీ వుందని తెలుసుకున్న విద్యార్థినులు వుద్యమం లోకి రావడం మొదలైంది. విప్లవోద్యమం వలన అలా వచ్చిన స్త్రీలు అన్ని రంగా ల్లోనూ వున్నారు. విద్యార్థులు చేసిన పోరాటాల్లో విద్యార్థినులుగా మహిళలు కదిలారు. విద్యార్థులు గ్రామాలకు వెళుతూవుంటె విద్యార్థినులూ వెళ్ళారు. పురుషులతోపాటు స్త్రీలు అన్ని పనులు చేయగలరనీ, స్త్రీలు పాల్గొనకుండా ఏ విప్లవం విజయవంతం కాదనీ, దేశ విముక్తి కోసం, మహిళా విముక్తి కోసం ఎలాంటి త్యాగాలైనా చెయ్యగలరనీ ఆచరణలో నిరూపిస్తూ ప్రజలకు దగ్గరయ్యారు. ప్రజల కంటి పాప లయ్యారు. వాళ్ళ ఇంటి పిల్లలయ్యారు. విప్లవోద్యమంలో విప్లవ జ్యోతులయ్యారు.

ఎనమండుగురు క్యాంపెయన్ దళం, అందులో నలుగురు RSU విద్యార్థినులు, ఒక RSU విద్యార్థి, యిద్దరు రైతుకూలి సంఘ కార్యకర్తలు, దళానికి బాధ్యురాలుగా రైతాంగ మహిళా కార్యకర్త వుంటారు. మొత్తం 18 రోజుల క్యాంపెయన్. క్యాం పెయన్ జరిగిన గ్రామాలన్నీ అదివరకే నిర్బంధాన్ని చవిచూసాయి. గ్రామాలకు ఒక పద్ధతి ప్రకారం వెళ్ళడం ప్రతి గ్రామంలో మీటింగ్ పెట్టడం, పాటలు పాడడం, వుపన్యసించడం, సంతకాలను సేకరించడం, గోడలమీద నినాదాలు రాయడం క్యాం పెయన్‌లోని ప్రధాన కార్యక్రమం. గ్రామ ప్రజలు పెట్టింది తినడం, వాళ్ళ సహకా రంతో రక్షణ తీసుకోవడం క్యాంపెయన్‌లోని ఇతర కార్యక్రమం.

దళాన్ని శత్రు కంట పడకుండా ప్రజలు కాపాడుతారు. ప్రజలే నిజమైన వుక్కుకోట అని నిరూపిస్తారు. వెంటపడిన చివరిరోజు పోలీసులు ఒకవూళ్ళో దళం కోసం ఇల్లిల్లు వెతుకుతారు. ఒక ఇంట్లో దళానికి ఆశ్రయం లభిస్తుంది. "అందరం అలసి సొలసి వుండడంతో క్షణాల్లోనే నిద్రకు జారుకున్నాం. మా కమాండరూ, చిన్న కామ్రేడూ ఇద్దరూ వుదయమే ఇంటివాళ్లతో కలిసే లేచారు. ఆ యిల్లు హరి జనులదని తెల్లవారే మాకు తెలిసింది. ఆ యింటి అక్క వాళ్ళిద్దరూ తన చిన్నమ్మ బిడ్డలనీ, సెలవులకు వచ్చారనీ పొరుగు వాళ్లకు చెప్పింది. మా కామ్రేడ్స్ నీళ్ల తెచ్చారు. స్నానంచేసి బట్టలుతుక్కున్నారు. పిల్లల్ని ఎత్తుకున్నారు. మిగతావాళ్లం వున్నట్టు ఎవ్వరికీ తెలియనివ్వలేదు. మా గురించి, క్యాంపెయన్ గురించి రాత్రి జరి

గిన సంఘటన గురించి ఇంటివాళ్లకు చెప్పాము. అర్థం చేసుకున్నారు. కానీ పగలు పోలీసులు పూళ్ళోకొచ్చి రాత్రి రాడికల్స్ వచ్చారా అనీ, వాళ్లతో ఎవరికైనా సంబంధాలు వున్నాయా అనీ ఎంక్వైరీ చేసుకొని వెళ్లారు. గండం గడిచిపోయింది. ఆ యింటి అక్క అందరికి కన్నతల్లే". కన్నతల్లిలా ప్రజలు చూపించిన ఆదరణ నిర్బంధంలో సహితం చెక్కుచెదరిపోని మనోధైర్యం వాళ్ల ఆదర్శాన్ని బలపరిచాయి. దళం గ్రామ గ్రామాన తిరిగి ప్రచారాన్ని విజయవంతం చేయటానికి ఎంతగానో తోడ్పడ్డాయి.

దళానికి పోలీసులకు మధ్య జరిగిన ఈ పరుగుపందెంలో దళమే గెలిచింది. ఈ పరుగుపందెం అక్కడితో శాశ్వతంగా పూర్తి కాలేదనీ అంతిమ లక్ష్యం నెరవేరే దాక అది కొనసాగుతుందనీ నేడు ఆంధ్ర దండకారణ్యంలో తుపాకి పట్టిన ఎందరో అక్కలు, చెల్లెళ్ళు వీరికి మద్దతుగా వున్న లక్షలాది స్త్రీలు నిరూపిస్తున్నారు.

8) నిర్బంధాన్ని ధిక్కరిస్తాం : కామ్రేడ్ నీలోవ్నా రచించిన ఈ 'కథనం'లో విద్యార్థినులు తదితర మహిళలు నిర్బంధాన్ని గెలిచేసారు. 1985 లో 'అఖిల భారత విప్లవ విద్యార్థి సంఘం' (AIRSF) కాన్ఫరెన్స్ హైద్రాబాద్‌లో జరిగింది. ఆ సభకు భారత దేశంలో అనేక రాష్ట్రాల నుండి వేలాది మంది విద్యార్థినీ విద్యార్థులు కదిలివచ్చారు. ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్రంలోని అనేక జిల్లాల నుండి విద్యార్థినీ విద్యార్థులు అధిక సంఖ్యలో వచ్చారు. సభను విచ్ఛిన్నం చేయాలనీ పోలీసులు చాలా రకాల అడ్డంకులు ఏర్పరుస్తారు. సభకు వచ్చే వాళ్ళను ఎక్కడికక్కడ అరెస్టు చేస్తారు. అరెస్టుల మధ్యనే శత్రువు కన్నుగప్పి విద్యార్థులు తండోప తండాలుగా కదిలి వస్తారు. సభ సందర్భంగా, ఊరేగింపుకు అనుమతి కోరుతూ విద్యార్థినులు తదితర మహిళలు NTR ఇంటిముందు ధైర్నాయిస్తారు. అన్నగారు దొంగ నమస్కారాలు పెడుతూ వుండగానే, ఆయన కావలి కుక్కలైన పోలీసులు స్త్రీలను లాఠీలతో కొట్టడం, కాళ్ళతో తొక్కడం, పిడిగుద్దులు గుద్దడం, కొంగులు బట్టి వ్యాన్‌లో పడవేయడం చేస్తారు. ఇలాంటి పరిస్థితిలో కూడా మహిళలు తమ మనోనిబ్బరాన్ని ఏ మాత్రం సడలించక, రగులుతున్న కోపాగ్ని రెట్టింపుకాగా పోలీసులను చెప్పులతో కొట్టి, కిందపడ్డ వాళ్ళ టోపీలను తొక్కి, వాళ్ళ మీద వుమ్మేస్తారు. ఈ సంఘటనలో కొంతమంది మహిళలు గాయపడ్డారు. 300 మందిని పోలీసులు వ్యాన్‌లో ఎక్కించుకొని జైలుకు తీసుకెళతారు. 300 గొంతులు ఒక్కసారిగా జైలు గోడలు

పిక్కటిల్లేలా విప్లవ నినాదాలు చేస్తూ, శత్రువును దిగివచ్చేలా చేస్తాయి. ఆ విజయంతో సభ జరుపుకొని, తిరిగి రైలులో వెళుతున్న విద్యార్థినీ–విద్యార్థులను కాజీపేట రైల్వేస్టేషన్‌లో అప్పటి SI యాదగిరి రెడ్డి (తర్వాత వీడు ప్రజల చేతుల్లో కుక్కచావు చచ్చాడు) అధ్వర్యంలో నిలిపివేసి అందరిని లాఠీలతో కొట్టుకుంటూ బూతులు తిడుతూ నిర్బంధించిన సంఘటనే 'నిర్బంధాన్ని ధిక్కరిస్తాం' కథనం.

పోలీసులు సభకు వెళ్ళి వస్తున్న వారిపట్ల వ్యవహరించిన తీరు, వాళ్ళలో కల్గిన మానసిక ఘర్షణా, శత్రువు పట్ల వారిలో రేగిన కసి–ఈ కథనంలో ప్రధానాంశం. నిర్బంధంలోకి తీసుకోబడిన వాళ్ళలో 25 మంది స్త్రీలు కూడా వుంటారు. పోలీసులు వాళ్ళతో చాల అసభ్యంగా మాట్లాడుతారు. "ఎవరే మీలో అడవులకు వెళ్ళేది ? ఫోటో దిగుదురుగాని రండి" అని తీసుకెళుతూ వాళ్ళ అడ్రస్‌లు తీసుకుంటారు. ఒక కామ్రేడ్–ఫలానా అని అడ్రస్ చెబుతుంది. పిల్లికళ్ళ అధికారి విషయం చెప్పవే అంటూ నాలుగు దెబ్బలు కొట్టి "నీ మొగుడున్నాడటే ? ఎక్కడున్నాడు ? నువెక్కడుంటున్నావ్ ? లాడ్జింగ్‌లోనా ?" అని బూతులు తిడుతూ తిరిగి కొట్టడం ప్రారంభిస్తాడు. ఇలాంటి తన్నులు తిట్టు విప్లవోద్యమం నుండి వాళ్ళను వెనక్కు మరలించలేదు. శత్రువు పట్ల వాళ్ళలో కసి రెట్టింపయి నిర్బంధాన్ని ధిక్కరిస్తూ ఆకాశంలో సగంగా, విప్లవోద్యమంలో సగంగా కదులుతున్నారు. ఈ కథనంలో నిర్బంధాన్ని చవి చూసిన ఒక కామ్రేడ్ ఇలా అంటుంది–"నా కళ్ళు జ్యోతుల్లాగా మండుతున్నట్లు అనిపించాయి. నా పెదవులు గొణుగుతున్నాయి. కామ్రేడ్స్! ఈ లాఠీల తూటాల రాజ్యం ఇక సాగదు–సాగదు".. నిర్బంధాన్ని చవి చూసిన ప్రతి ఒక్కరి నోట ప్రతిధ్వనించిన మాటలివి. దోపిడీ రాజ్యాన్ని కూల్చటానికి కోట్లాది మహిళలు గొంతు కలిపి నినదించిన నినాదమది.

9) అడవిలో వెన్నెల : ఈ కథా రచయిత కామ్రేడ్ బి.యస్. రాములు మన్యంలోని షోలాబు ప్రజల జీవితాన్ని వారి పోరాటాన్ని వారి మార్గదర్శకులైన అన్నలను రక్షించిన ఒక సంఘటనని రచయిత ఈ కథలో వివరించారు. ఇది 1985లో జరిగిన షోలాబు ప్రజల పోరాట గాధే అయినా దండకారణ్యంలోని ఎన్నో గూడాల పోరాట గాధలకు సజీవ చిత్రణ కూడా. పోలీసుల తీవ్ర నిర్బంధం సామూహిక మానభంగాలు షోలాబు స్త్రీల మనోనిబ్బరాన్ని దెబ్బతీయలేదనీ, పైగా

వారి వర్గ కసే 20 మంది పోలీసుల్ని తమ పాదాల చెంత కట్టి పడవేశాయని ఈ కథలో రచయిత వివరించారు.

అడవిలో వెన్నెల్ల కాస్తే ఎవరికి ప్రయోజనం వుండదంటారు. ఈ మాటలు ప్రచారంలోకి తెచ్చింది దోపిడీ వర్గాలే, ఎందుకంటె అడవిలో వెన్నెల కాస్తే, అడవి బతుకుల్లో వెలుగు నిండుతుంది, అది దోపిడీదార్లకు అమావాస్య చీకటి–సామెత అయితే చెప్పారు కానీ అడవిలో వెన్నెల కాయకుండ చేయడం ఎవరి తరం.

ఆ గూడెం పేరు షోలాబు. అది కాకరపాడు దగ్గరలో వుంటుంది. విశాఖరేవు, రాజమండ్రికి దాదాపు సమాన దూరంలో వుంటుంది. విశాఖ తూర్పుగోదావరి అడవి ప్రాంతాన్ని మన్యం అంటారు. షోలాబు మీద పోలీసులు దాడి చేసి గుడిసెలు కూలగొట్టి, దొరికిన ప్రతి ఒక్కర్ని కొట్టి, స్త్రీలను మానభంగం చేస్తారు. ఒక రక మైన భీతావహ వాతావరణంలో గిరిజనులు బిక్కు బిక్కు మంటూ ఏ రాయి అలికి డైనా పోలీసుల బూట్ల చప్పుడే అనుకొని భయపడే పరిస్థితి నెలకొంటుంది. ఈ పరిస్థితిలో అక్కడి స్త్రీల మానసిక ఘర్షణ ఎలా వుందో కథలోని రెండు పాత్రలు–రూపులమ్మ పార్వతి ద్వారా అర్థం అవుతుంది. అంతగా భయపడిన ఆ గ్రామ ప్రజలే మరొకసారి దాడికి వచ్చిన పోలీసులను కట్టేసి బట్టలూడదీసి కొడతారు.

గూడెం నిశ్శబ్దంగా వుంది. అప్పుడే నిద్రలేచిన రూపులమ్మ నెల రోజుల క్రింద జరిగిన సంఘటనలు ఒక్కొక్కటే కళ్ళ ముందు కదలాడుతూ వుంటే తనలో తాను అనుకుంటుంది. కాకీ బట్టలు, కరుకు బూట్లు–లాఠీ, తుపాకి మడమల్తో బాదడం–పార్వతి ఒక్కదాన్ని లాక్కుపోయి పదిహేను మంది తోడేళ్లలాగ చీరుకు తినడం–రక్కడం, కొరకడం అందరి ముందె బట్టలూడదీయడం, ముట్టుకోసం పెట్టుకున్న పాత గుడ్డ పీకెయ్యడం, ఒకరి తర్వాత ఒకరు దాన్ని పాడుచేయడం'', ఆ సంఘటన లన్ని ఒక్కసారి కళ్ళముందు కదలడంతో మరింత వణికి పోయింది రూపులమ్మ. అలా వణికిన రూపులమ్మ రాత్రికి గూడెం వచ్చిన అన్నలు అందర్ని కూర్చోబెట్టి మాట్లాడినప్పుడు–పోలీసుల బూట్ల చప్పుడు విని సెంట్రీని ఇసారం చేసి అన్నలు తప్పుకునేటట్టు చేస్తుంది. గతంలో తనను 15 మంది పోలీసులు దారుణంగా మాన భంగం చేసినా చలించని పార్వతి గూడెం వచ్చిన పోలీసులను కసిదీర కొడుతుంది. రూపులమ్మ బాలవ్వ తమకు జరిగిన అవమానాలకు కసిగా పోలీసుల బట్టలూడదీసి

బాదుతారు. గూడెంలోని ప్రతి స్త్రీ, పురుషుడు తమపై జరిగిన దాడికి ప్రతీకారంగా పోలీసుల వళ్ళు వాయగొడతారు.

నెలరోజుల క్రితం జరిగిన విషాద భయంకర సంఘటన వాళ్ళ హృదయాల్లోంచి యిప్పుడు చెరిగి పోయింది. పిరికితనం, భయం మటు మాయమైంది. భయంతో వణికిపోయిన రూపులమ్మకు పోలీసులను కొట్టి బాదడంతో తన శక్తే మిటో తనకు తెలిసి వచ్చింది. రూపులమ్మ, పార్వతి, బాలవ్వ....అందరి సంతోషానికి హద్దులేదు. ఆ రోజు గూడెం—గూడెం పండుగ చేసుకుంది. శత్రుపు మరో గంటలో అయిదు వందల మందితో తమ మీదికి వస్తారనీ వాళ్ళకు తెలియదు. ఆయుధాలు అధికారం పీడితుల మీద జులుం చేస్తునే వుంటాయి. ఎప్పటి వరకు ? అవి పేద ప్రజానీకం చేతుల్లోకి వచ్చేదాక!

పోలీసు కిరాతకుల చేతుల్లో పార్వతి లాగ అవమానాలకు గురయినవారు గూడేలలో ఎందరో వున్నారు. వాళ్ళు మానం పోయిందని బాయిల్లో దూకి చావ లేదు. సిగ్గుతో తలవంచుకుని మూలకు కూర్చోలేదు. కసితో రగులుతూ పోరాట మంటల్ని రాజేసింద్రు— షోలాబులో పోలీసులతో జరిగిన సంకుల సమరంలో పార్వతి రూపులమ్మ రాజేసిన మంటలు నేడు దండకారణ్యం అంతా అలుముకున్నాయి. ఆ మంటల వెలుగులో ప్రతి మహిళా సాయుధమై సమరం చేస్తుంది.

10) నేరస్తులు : కామ్రేడ్ కళ్యాణరావుగారు రచించిన ఈ కథని మొదట అరుణతార ఆగస్టు 1988 సంచికలో ప్రచురించారు. త్యాగమే ఊపిరిగా జీవించే ఒక మహిళా కామ్రేడ్ గురించి చాల గొప్పగా రాశారు. 1985 నుండి ఆంధ్ర దండ కారణ్యాల్లోని చెరసాలలో మగ్గుతూ, ఉరికొయ్యల అంచుల వరకెళ్ళి వచ్చిన ఎందరో మహిళా కామ్రేడ్స్ వాస్తవ గాథలకు 'నేరస్తులు' కథ ఒక సజీవ చిత్రణ.

మహిళలు సాంఘికంగా ఆర్థికంగా తమపై జరిగే అణిచివేతలకు వ్యతిరేకంగా పోరాడటం మాత్రమే కాదు. మహిళల విముక్తి పీడిత ప్రజల విముక్తితోనే సాధ్యమని నమ్మి పార్టీలో చేరి చోదక శక్తులవుతున్నారు. 1978 నుండి ఇప్పటి వరకు అనేక మంది మహిళలు ప్రజాసంఘాల్లోనే కాక పార్టీలో కూడా చేరి పని చేస్తున్నారు. ఆర్గనైజర్లుగా, దళ కమాండర్లుగా, దళ సభ్యులుగా రచయితలుగా టెక్ యంత్రాంగంలో ముఖ్యులుగా వివిధ పనులు చేస్తున్నారు.

రహస్యంగా డెన్ మెయింటెన్ చేస్తూ అరెస్టయిన ఒక మహిళా కామ్రేడ్ తాలూకు అనుభవమే నేరస్తులు కథ. ఆమె భర్తను పోలీసులు అరెస్టు చేసి చంపేస్తారు. తనను ఎన్ని చిత్రహింసలు పెట్టి బాధించినా తన సంస్థ రహస్యాన్ని బయటికి పొక్కనివ్వదు. శత్రు నిర్బంధంలో తన పెళ్ళినాటి విషయాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ ఇలా అంటుంది—"జీవితం ఎప్పుడూ అందమైందే, అందులోనూ పోరాట జీవితం మరీ అందమైంది. అందుకే మన కలయికలో ఇంత అందం వుంది".

పుట్టిన ప్రతి ప్రాణి జీవించాలనుకుంటుంది. జీవించటం ఎంత వాస్తవమో చావు కూడా అంతే. అయితే జీవించడానికీ, చావుకూ ఒక పరమార్థం వుండాలి. ఎందరో పుడుతూ వుంటారు, చస్తూ వుంటారు. ఒక వ్యక్తిని మరొక వ్యక్తి పీడించని రీతిలో, అందరూ సమాజంలోని వ్యక్తులుగా స్వేచ్ఛగా జీవించ గలగాలి కాని సమాజంలో నేడు అలా లేదు. ఈ సమాజం మారాలి. ఈ సమాజాన్ని మార్చాలంటే కొందరి దృష్టిలో అది నేరం అవుతుంది. ఎవరా కొందరు ? వాళ్ళే దోపిడిదారులు. ప్రభుత్వం దృష్టిలో పోలీసుల దృష్టిలో నేరం అయినది ప్రజల దృష్టిలో నేరం కాదని ఆమె అంటుంది. "నేను జీవితాన్ని ప్రేమిస్తున్నాను. దాని విలువల్ని వునికిని సమాధి చేసే ఈ వ్యవస్థని ద్వేషిస్తున్నాను. ప్రేమించడం కోసం జీవించాలనుకుంటున్నాను ద్వేషించడం కోసం జీవించాలను కుంటున్నాను. ప్రజల్ని ప్రేమించడం నేరం కాదు. దోపిడీని ద్వేషించడం పాపం కాదు. ఇంతకన్నా విలువైన మాటలు ఏమున్నాయి ఈ నేల మీద". ఇలాంటి మాటలు అనే ప్రతి ఒక్కరూ ప్రభుత్వం దృష్టిలో నేరస్తులే. అలాంటి నేరాలు మనం నేలతల్లి విముక్తి అయ్యే దాక మళ్ళీ—మళ్ళీ చేద్దాం అంటూ పిలుపునిస్తుంది ఆ మహిళా కామ్రేడ్.

× × × ×

తిమ్మాపూర్‌లో మహిళలు పిడికిళ్ళెత్తారు. చిన్నమెట్ పల్లిలో స్త్రీలు కుంపటి రాజేశారు. ఇంద్రవెల్లిలో గొడవలితో పోలీసు కుత్తుక నరికారు. సింగరేణిలో అధికారులను ఘెరావ్ చేసారు. అదిలాబాద్‌లో రక్తపింజరులైన పోలీసు అధికారుల కోరలు విరిచారు. కరీంనగర్‌లో పోలీసులతో పరుగుపందెంగా ప్రచార క్యాంపెయిన్ నిర్వహించారు. వరంగల్లులో నిర్బంధాన్ని ధిక్కరించారు. షోలాపురలో పోలీసుల్ని నిరాయుధుల్ని చేసి బంధించారు. అడుగడుగునా త్యాగమే ఊపిరిగా జీవించే ఆదర్శాన్ని నెలకొల్పుతున్నారు మహిళలు.

నిన్న గుమ్మలాపురం, పండితాపురం, పైడిపాల వీరాపురం, సాత్నాల, పామేడు, సుర్సుండి నేడు ఎన్నెన్నో గ్రామాల్ని మొత్తంగా ఆంధ్ర దండకారణ్యాల్లోని అన్ని పోరాటాల్లో, అన్ని ప్రచారాల్లో, అన్ని ఆందోళనల్లో అక్కల పాత్ర వుంది.

ఈ పోరాటాలన్నింటా వ్యక్తులుగానూ, సంఘటితంగానూ పాల్గొన్నారు. స్పాంటేనియస్‌గానూ, చైతన్యవంతంగానూ పాల్గొన్నారు.

సామ్రాజ్యవాదానికి ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా జరుగుతున్న నూతన ప్రజాస్వామిక విప్లవపోరాటాల్లో పురుషులతోపాటు వేలాదిమంది స్త్రీలు పాల్గొంటున్నారు. వివిధ ప్రజాసంఘాల్లో, ప్రత్యేకంగా మహిళా సంఘాల్లో సంఘటితమవుతున్నారు. విప్లవ పార్టీలో చేరి ప్రజా పోరాటాలకు నాయకత్వం వహిస్తున్నారు. దళాల్లో చేరి సాయుధపోరు చేస్తున్నారు. సాహితీ కళా రంగాల్లోనూ, ప్రజా హక్కుల వుద్యమాల్లోను గణనీయమైన కృషి చేస్తున్నారు.

ఉద్యమిస్తున్న స్త్రీలు స్థానిక శతృవుల దాడిని, రాజ్యాంగ యంత్రం యొక్క క్రూరమైన దాడిని ఎదుర్కొంటూనే ఉన్నారు. ఆంధ్ర దండకారణ్యాల్లో పోలీసు పారా మిలటరీ ఫాసిస్టు బలగాల సాయుధ దాడికి గురవుతున్నారు. రేపు కసాయి మిలటరీ దాడి నెదుర్కోవలసి వస్తుందనే అవసరాన్ని గుర్తిస్తూ మరింత పట్టుదలతో ముందుకు కదులుతున్నారు.

జాతీయంగా, అంతర్జాతీయంగా మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానంపై రివిజనిస్టులూ సామ్రాజ్యవాదులూ చేస్తున్న దాడుల్ని సైతం విప్లవ సిద్ధాంతానికి కట్టుబడి మహిళలు ప్రతిఘటిస్తున్నారు. మార్క్సిజం అజేయమని గొంతెత్తి చాటుతున్నారు.

ప్రస్తుత దోపిడీవర్గ సమాజాన్ని మార్చటానికి మొత్తంగా పితృస్వామిక సమాజాన్ని మార్చటానికి అవిశ్రాంతంగా మహిళలు పోరాడుతున్నారు. ఈ పోరాటాలకు పైన వివరించిన 10 కథల్లోని మహిళల జీవితాలు కూడా సజీవంగా తోడ్పడినాయి. ఆ కథల్లో వివరించిన మహిళల పోరాటపాత్రలు నేడు మరింత వీరోచితంగా, త్యాగపూరితంగా, వున్నత చైతన్యంతో ప్రకాశమానంగా వెలుగొందుతున్నాయి. ఆకాశంలో సగంగా సమర కేతనాన్ని ఎగరవేస్తూ మహిళలు తమ పాత్రని నిర్వహి

స్తున్నారు. తమ అద్వితీయమైన పాత్రతో చరిత్రను నిర్మిస్తున్నారు. నాటి కామ్రేడ్స్ అంకమ్మ నిర్మల సరస్వతి తదితరులకు వారసులుగా నిలిచిన నేటి జ్యోతి, స్వర్ణ, రాజక్క, పద్మ, నర్సక్కలు కోట్లాది మహిళా వీరయోధుల ఆవిర్భావానికి తమ రక్తాన్ని చిందించారు. వారి ఆదర్శాల వెలుగులో మహిళా ఉద్యమం నేలతల్లి విముక్తికోసం యీ దోపిడీ వ్యవస్థని కూకటి వేళ్ళతో పెకలించటానికి ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తోంది.

—సుజాత



కోసిన పంటంత 'దొబ్బ'
తొసుకు కూర్చునోడా
కాలం మారిందిరో-నీ
'గాదె'లో ఇక గింజ పడదు

చిత్రం : వి. యస్. స్వామి

## లేఖ

10-12-91న ఆలస్యంగా అందిన 'అరుణతార' తిరగేస్తుంటే ఒక వాక్యం దగ్గర కళ్ళు ఆగిపోయాయి. ఆ వాక్యాన్ని మళ్ళీ, మళ్ళీ చదువుతున్నా దాని నిజమైన అర్థాన్ని మెదడు అందుకోవటానికి రెండు నిమిషాలు పట్టింది. "సఖా ప్రారంభంలో కవయిత్రీ, సాహితీ విమర్శకురాలు, జర్నలిస్టూ అయిన సావిత్రిగారి మరణానికి సంతాపం ప్రకటించారు. కొద్ది నెలల క్రితం ఏ క్షణంలోనైనా ఈ వార్త వస్తుందని సిద్ధంగా వుండినా, ఎంతో బలమైన పితృస్వామ్యాన్నే ఎదిరించిన నేను, మృత్యువుకి అంత సులభంగా లొంగుతానా అన్నట్టుగా అందర్నీ ఆశ్చర్యపరుస్తూ ఆమె మళ్ళీ తన పసిపాపలాంటి నవ్వు నవ్వేసరికి 'హమ్మయ్యా' అని ఊపిరి పీల్చుకొన్నాం. అందుకే ఈ వార్త అశనిపాతంలా తగిలింది. మనకు ఆప్తులయిన మనుషులకు చాలా కాలంగా దూరంగా వుంటూ వుంటే, వాళ్లు యిక మనకు కనపడరు అనే విషయంలోని గాఢత్వాన్ని నిజంగా అర్థం చేసుకోవటానికి నిజంగా చాలాకాలమే పట్టవచ్చు. సావిత్రిగారి గురించి అలాగే అన్పిస్తుంది.

వాళ్ళ తలిదండ్రులు ఏ వుద్దేశంతో ఈ పేరు పెట్టారోగాని, ఆమె మాత్రం ఈ 'సావిత్రమ్మల' 'అనసూయమ్మల' సంస్కృతిని నాశనం చేయడానికే పుట్టినట్టుగా వుండేవారు. ఆమెతో పరిచయం కొన్నిరోజుల సాన్నిహిత్యమే అయినా, పురుష స్వామ్య సమాజం అంటే ఏమిటో, అది తన నెదిరించిన స్త్రీని ఎన్ని విధాలుగా బ్రేక్ చేయడానికి ప్రయత్నిస్తుందో, అయినా దాన్ని ధైర్యంగా ఎదిరించటంద్వారానే దాన్నెలా నాశనం చేయాలో యివన్నీ ఆమె మాటల్లో ఎక్కువగా చెప్పలేదు. తన జీవితం నుండి నేర్చుకోమన్నట్టుగా జీవించారు.

తనకూ, తన యిద్దరు కూతుళ్ళకూ చాలీ చాలని జీతంలో, ఓ కారు షెడ్డులో, బంధువులందరికీ దూరంగా, స్నేహితులే ఊపిరిగా, అపారంగా వుండిన వొంటరితనంలో, అనారోగ్యంలో,.... ఏ విలువల కోసం ఆమె నిలబడింది? దేనికోసం కలలు గన్నది? దేనినుండి ఉత్తేజాన్ని పొందింది? ఎంత ఘోరమైన పరిస్థితుల్లోనైనా ఆమెను బేలగా మారిపోకుండా ఏది కాపాడింది? దేనికోసం పలవరిస్తూ ఆమె తుది శ్వాస విడిచివుంటుంది?

సావిత్రిగారి గురించి మాట్లాడటమంటే వీటన్నిటినీ గురించి మాట్లాడ్డమే

అవుతుంది. "ఎందరో గొప్పగొప్ప రచయితలూ, కవులూ స్త్రీల సమస్యల గురించి స్త్రీలుకూడా ఒక్కోసారి impress చేయలేనంత గొప్పగా రాస్తారు. అది చదివి మనం వారిని ఎంతో గౌరవిస్తాం. అబ్బా! స్త్రీ హృదయాన్ని ఎంత గొప్పగా అర్థం చేసుకొన్నాడు! ఎంత గొప్పగా ఆయన జీవిస్తున్నాడో అనుకుంటాం. కానీ తర్వాత నిజజీవితంలో వారు స్త్రీల విషయంలో ప్రవర్తించే తీరు, వ్యక్తపరిచే భావాలూ ఎంతో నీచంగా కూడా వుంటున్నాయి. మరి ఈ విషయాలు తెలిశాక మనం వారి రచనలకు అదే విధంగా స్పందించగలమా? అంటూ తన'అభిమాన రచయితల, కవుల మాటలకూ, చేతలకూ ఉన్న తేడాను చూసి సావిత్రిగారు వ్యక్తం చేసిన ఆవేదనను పీరిలో ఎంతమంది పట్టించుకొన్నారు? పట్టించుకొంటున్నారు ?

స్త్రీలలో ఎంత చిన్నస్థాయిలోనైనా స్వాతంత్ర్య భావాలూ, చైతన్యం చూసినా ఎంతో సంతోషపడిపోయే సావిత్రిగారు, ఈ సమాజంలో ఎంత చిన్న రూపంలోనైనా ఎంత చిన్న మాటలలోనైనా వ్యక్తమయ్యే పితృస్వామ్య భావాలకు అంతగానూ బాధ పడేవారు, మంచిపడేవారు. కొంతమంది సావిత్రి ప్రతి చిన్న విషయాన్నీ పట్టించుకొంటుంది, Sensitive గా ఎందుకుంటుందో అనేవారు. చిత్రహింసలతో ఒంటినిండా గాయాలు చేసి, తర్వాత చిన్న సూదితో గుచ్చితేనో, చిన్నగా కొట్టితేనో ఆ వ్యక్తి మూలిగితే, "యింత చిన్న దెబ్బకే మూలుగుతావా ? అంత Sensitive గా ఎందుకుంటావు ?" అని అడిగినట్టె ఉంటుంది. అటువంటి వాళ్ళను చూస్తుంటే ఆమె అంత Sensitive గా ప్రతి చిన్న విషయానికీ స్పందించటానికి ఆమెలో ప్రత్యేకంగా వున్న జీన్స్ ఏమైనా కారణమా ? లేక ప్రతి చిన్న విషయంలోనూ స్త్రీని చిన్న చూపు చూసే, కించపరిచే సమాజం కారణమా ? నిజానికి అలా ప్రతి చిన్న విషయంలోనూ స్త్రీల పట్ల వుండే తప్పుడు భావాల్ని పోగొట్టాలనే ఆమె తపన ఆహ్వానించదగిందే, ప్రతి మనిషిలో మనం కోరుకోదగిందీ కాదా ?

సావిత్రిగారు స్త్రీల విషయంలోనే కాదు, సమాజంలో అన్యాయానికీ, అణచివేతకీ గురవుతున్న వారందరి గురించీ, అంతే Sensitive గా స్పందించారు. ఆలోచించారు. ఆమె తన తాత్విక దృక్పథంగా మార్క్సిజాన్ని స్వీకరించారు. తాను స్వయంగా విప్లవోద్యమంలో క్రియాశీలంగా పాల్గొనకపోయినా నక్సలైటు ఉద్యమ అభిమానిగా వున్నారు. ఆ అభిమానం ఆమెను జైలుకు పంపింది. రాడికల్స్ పెట్టిన మీటింగ్‌కు పోతుంటే దూరంనుంచే పోలీసులు 'మీటింగ్‌ను జరగనివ్వకుండా

రాడికల్స్‌ను పట్టుకోవడం చూసి, 'నా కెందుకులే' అని తప్పించుకు తిరగడం చేత గాని సావిత్రిగారు పోయి "ఎందుకు వీళ్ళను అరెస్టు చేస్తున్నారు?" అని గట్టిగా అడిగినందుకు ఆమెను కూడా తీసుకుపోయి, వారం రోజులకుపైగా ఆమాకీ తెలియకుండా లాకప్పులన్నీ తిప్పారు.

ఆ అనుభవం ఆమె విశ్వాసాలను యింత కూడా మార్చలేక పోయింది. విశాఖపట్నంలో మహిళా సంఘాల సమావేశాల్లో, క్యాంపెయిన్‌లో తనకు ఓపిక ఉన్నంతవరకూ అంటే మంచాన పడేంతవరకూ కూడా ఆమె పాల్గొనేవారు.

ఆమె మాటల్లో చెప్పాలంటే మార్క్సిస్టు తాత్విక దృక్పథమే ఆమెని ఇన్ని బాధల్లో కూడా నిలబెట్టింది. ఎవరు కలిసినా, కలవకపోయినా, అనారోగ్యమైనా, ఆర్థిక బాధల్లోనైనా ఎలాంటప్పుడైనా ఆమె Sense of humour చూసి ఎంతో ఆశ్చర్యమేసేది. 'ఎలా ఉండగలుగుతున్నారండీ' అని మేం అడిగినపుడల్లా ఆమె సమాధానాలన్నింటి సారాంశం పైన చెప్పిందే.

సమాజం అనే యుద్ధరంగంలో పెట్టుబడిదారీ సైన్యంలోని 'పితృస్వామ్యం' అనే బలమైన సైనికాధికారికి వ్యతిరేకంగా ఎంతో వీరోచితంగా ఒంటి నిండా అయిన గాయాల నుండి నెత్తురోడుతున్నా, చివరంటా నిలిచి, పోరాడి ఒరిగిన వీర వనితగానే సావిత్రిగారు నాకు గుర్తుంటారు. ఎన్నడూ తనకు వ్యక్తిగతంగా యిది కావాలి అని ఎవరి నుండీ కోరినట్లు నాకెప్పుడూ కనిపించలేదు. ఆమె నిజంగా కోరుకొన్నది, కలలు గన్నది కమ్యూనిస్టు సమాజాన్ని, పితృస్వామ్య సమాజ స్తంభాల నాశనాన్ని. ఆమెకు వీటిని వాగ్దానం చేయడానికి ఎవరెవరం సిద్ధంగా వున్నామూ అని ఆమె కళ్ళు సూటిగా ప్రశ్నిస్తూనే వుంటాయి.

—అనామిక

# విరసం విశేషాలు

విరసం సభ్యుడు కా॥ బి. యస్. రాములు రాసిన "గతితర్క తత్వ దర్శన భూమిక" గ్రంథం 14-12-91న నెల్లూరులో అంబేద్కర్ భవన్‌లో ఆవిష్కరించ బడింది. ఈ సభకు ఐ. రామచంద్రరావుగారు అధ్యక్షత వహించగా, పై రాజశేఖర్ గారు ఆవిష్కరించారు. బి. యస్. రాములు మాట్లాడుతూ తాను రచయిత నుండి, విప్లవకారుడినుండి తత్వవేత్తగా కూడా ఎదిగిన క్రమాన్ని వివరించారు. ఈ "గతి తర్క తత్వదర్శన భూమిక" పరిణతి చెందిన మహత్తర పరిశీలన ఫలితమని వక్తలు అభిప్రాయపడ్డారు.

## కయ్యూరు కామ్రేడ్స్ అమరత్వాన్ని చిత్రించిన కామ్రేడ్ నిరంజన చిరస్మరణీయుడు

(కామ్రేడ్ రమేశన్ సంస్మరణ సభ, కన్నూరు (మార్చి 14, 92)లో చేసిన తీర్మానం)

సుప్రసిద్ధ కన్నడ రచయిత నిరంజన మరణంపట్ల ఈ సభ గాఢమైన సంతాపాన్ని వ్యక్తం చేస్తున్నది. కామ్రేడ్ నిరంజన కన్నడంలో ప్రగతిశీల సాహిత్యోద్యమ నిర్మాత. విప్లవోద్యమానికి మిత్రుడు. తన నవల 'చిరస్మరణ' ద్వారా కయ్యూరు విప్లవ గాథను గానం చేసిన కామ్రేడ్ నిరంజన మలయాళీలకు మరింత ప్రీతిపాత్రుడు. మలయాళంలోకి అనువదింపబడిన 'మృత్యుంజయన్' నవల చదివిన మేమాయనను మృత్యుంజయుడుగా భావిస్తున్నాం.

కన్నూరు (కేరళ)
14-3-92

సం॥ కె. ఎ. మోహనదాస్, (అధ్యక్షుడు)
జనకీయ కళాసాహిత్యవేది (కేరళ)
అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి
(కార్యవర్గ సభ్యుడు)

# పీడిత ప్రజా పక్షపాతి నిరంజన

సుప్రసిద్ధ ఆధునిక ప్రగతిశీల కన్నడ రచయిత నిరంజన ఇటీవలే మరణించాడు. చాలాకాలంగా అనారోగ్యంతో బాధపడుతూ కూడా ప్రజల కోసం తపించి కలం పట్టిన కలం యోధుడు నిరంజన. తెలుగులోకి అనువాదమయిన చిరస్మరణ, మృత్యుంజయుడు నవలల ద్వారా ఆయన తెలుగు పాఠకులకు సుపరిచితుడు. మాధవి నవల రాసిన అనుపమ నిరంజన జీవిత సహచరిణే.

నిరంజన విద్యార్థి దశలోనే కమ్యూనిస్టు పార్టీలోకి ఆకర్షితుడయ్యాడు. కర్నాటకలో అభ్యుదయ రచయితల సంఘాన్ని స్థాపించిన ఘనత నిరంజనదే. ఆయన స్వయంగా గోర్కీ రచనలను అనువాదం చేశాడు. కర్నాటకలో ప్రగతిశీల నాటకరంగాన్ని ప్రోత్సహించడం ద్వారా, దళిత ఉద్యమానికి చేయూతగా ఉండడం ద్వారా నిరంజన పీడిత ప్రజల పక్షపాతి అయ్యాడు.

నిరంజన నవల 'చిరస్మరణ' మళయాళ భాషలోకి అనువాదమయినపుడు మళయాళ సాహిత్యంలో ఒక సంచలనం సృష్టించింది. ఉద్యమ జీవితాన్ని చిత్రించడంలో ఆయనకు ఆయనే సాటి అనిపించుకున్న గొప్ప రచయిత. ఆయనకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డుగానీ, జ్ఞానపీఠ అవార్డుగానీ రాలేదు. రాకపోవడం కూడా సాహిత్య రంగంలో ఆయన పీడిత ప్రజా పక్షపాతానికి ఒక నిదర్శనం.

నిరంజన స్మృతికి విరసం జోహార్లర్పిస్తోంది.

కావలి, వి. చెంచయ్య

17-3-92 విరసం రాష్ట్ర కార్యదర్శి

## విరసం విశేషాలు

విరసం సభ్యుడు కా॥ వి. యస్. రాములు ఇంటిపై 29-1-92 అర్ధరాత్రి పోలీసులు దాడి చెయ్యటానికి ప్రయత్నం చేశారు. ఆ రోజు వి.యస్. రాములు ఇంట్లో లేడు. మరునాడు విలేకరులు సి.ఐ., యస్.ఐ. లను అడిగితే తమకేమీ తెలియదని, ఏనాడైనా అలా వచ్చామా అని అన్నారట.

---

ఐ. యం. యఫ్. ను తరిమెయ్యండి!
నూతన పారిశ్రామిక విధానానికీ, అధిక ధరలకూ,
నిరుద్యోగానికీ వ్యతిరేకంగా పోరాడండి!
రాక్షస రాజ్య నిర్బంధాన్ని ఎదుర్కోండి!

# ఆల్ ఇండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం

## ప్రజానీకానికిస్తున్న పిలుపు

ఆంధ్ర, దండకారణ్యం, కర్ణాటక, తమిళనాడు, మధ్యప్రదేశ్, ఢిల్లీ, బీహార్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలకు చెందిన కార్మిక, కర్షక, విద్యార్థి, మేధావి, రచయితల, కళాకారులతో కూడిన 21 సంస్థలలో ఏర్పడిన ఆల్ ఇండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం (AIPRF) నిర్వహిస్తున్న సదస్సుకు అధిక సంఖ్యలో తరలిరండి.

స్థలం : పగిడేరు నగర్, షహీద్ మీనార్, కలకత్తా

కార్యక్రమం : **21-4-92 (మంగళవారం)**

'సామ్రాజ్యవాద దోపిడి' పై సదస్సు.

ప్రారంభోపన్యాసం : ప్రొ॥ సునీతికుమార్ ఘోష్

వక్తలు : ప్రొ॥ డి. యన్. రెడ్డి, ప్రొ॥ ఆర్. యస్. రావు తదితరులు

కీనోట్ పేపరు : A.I.P.R.F.

**22-4-92 (బుధవారం)**
'రాజ్యహింస'పై సదస్సు
వక్త : డా॥ కె. బాలగోపాల్
ఆంధ్ర, దండకారణ్యం, బీహారుల్లో నిర్బంధం, ప్రతిఘటన- AIPRF

మధ్యాహ్నం 2 గం॥లకు ర్యాలీ
సాయంత్రం 4 గం॥లకు బహిరంగ సభ
అధ్యక్షత : కా॥ పరేశ్ ధార్
వక్తలు : కె. జి. కన్నాభిరాన్, రాజ్ కిషోర్ సింగ్,
విజయకుమార్ ఆర్య, వరవరరావు,
ప్రొ॥ హరగోపాల్, AIPRF కన్వీనర్ ఖగేన్ దాస్,
గద్దర్.

---

# పోస్టరు

నా కళ్ళు నగరం గుండా నడుస్తున్నాయి
నా కాళ్ళు వెతుకులాడుతూ పోతున్నాయి
ఎటు చూసినా విలువలులేని సంస్కృతే
అంగాంగాలని అంగట్లో పరుచుకొని
నగరం గోడలనిండా నగ్నంగా
బూతు పోస్టర్లతో ఉన్మాద్విగ్నంగా
బోడి మొలల మీద అంగాలై అక్షరాలు!
నాలుగు గోడల మధ్యది....నడిరోడ్డుమీదే.... !?!?
చెరపరు ...కప్పరు....జారిపోయిన విలువల్ని నిలబెట్టరు
ఆం....అదిగో పోలీసుల గుంపు
ఎవ్వరికీ కనపడగూడదని కప్పేసిమరీ నిల్చుంది
వెళ్ళి చూశా.... ఏంటది?
'విరసం' పోస్టరు!
(విరసం 13వ మహాసభలకై గుంటూరు వెళ్ళి నగరాన్ని చూసాక, కా॥ నారాయణ స్వామి 'సాంస్కృతిక నాశనం' విన్నాక)

—బజరా

# స్వీకారం

1) విద్యార్థులుగా మార్క్సిస్టు మహోపాధ్యాయులు : డా॥ శివరామిరెడ్డి. తిరుగుబాటు ప్రచురణలు. 100 పేజీలు. వెల : 6 రూ. ప్రతులకు : ఎడిటర్, 'విద్యార్థి తిరుగుబాటు', 11-8-179/2, లెనిన్‌నగర్, ఖమ్మం- 507 001.

2) అగ్నిశ్వాస : పి.సి. రాములు కవితా సంపుటి. రవిచంద్ర పబ్లికేషన్స్ 72 పేజీలు. వెల : 12 రూ. ప్రతులకు : శ్రీమతి రమాదేవి, C-18, H.B. కాలనీ, అదిలాబాద్-504 001.

3) విప్లవకారుల ఐక్యతా సమస్య : సి.పి.ఐ. (యం. యల్. ప్రజాపంథా) అవగాహన. 84 పేజీలు. వెల : 5 రూ. ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, సుల్తాన్‌బజార్, హైదరాబాద్. (లేదా) 60/ఎ, ఓల్డ్ ఎం. ఎల్. ఎ. క్వార్టర్స్ హైదరాబాద్.

4) పైలా నిందారోపణలు : సమాధానం : పాతూరి ఆదినారాయణస్వామి. సి.పి.ఐ. (యం. యల్. ప్రజాపంథా) ప్రచురణ. 30 పేజీలు. వెల : 2 రూ. ప్రతులకు : 'ప్రజాపంథా' అడ్రసు.

5) సఖ్యతా కిరణాలు : సంకలనం. జి. శ్రీశైలం. వచన కవితా సంపుటి. 36 పేజీలు. వెల : 8 రూ. ప్రతులకు : జి. శ్రీశైలం, సప్తగిరి సమితి, 1-79, హైదర్‌నగర్, హైదరాబాద్-500 872.

6) శేషేంద్ర మౌక్తిక పర్వం. గుంటూరు శేషేంద్రశర్మ కవితలకు వ్యాఖ్యానం- వ్యాఖ్యాత : జి. శ్రీశైలం. 53 పేజీలు. వెల : 3 రూ. ప్రతులకు : పై అడ్రసు.

7) హేతువాద సూత్రాలు : పసల భీమన్న ప్రచురణ : కవిరాజాశ్రమం : నాగండ్ల. వివిధ హేతువాద గ్రంథాల నుండి స్వీకరించిన 393 సూక్తులు, వెల : 5 రూ. ప్రతులకు : పసల భీమన్న, M.A., M.ED. ప్రిన్సిపాల్, గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, కర్నూలు-518 001

# ఖాకులు చేసిన హత్య

— మంగు జయప్రకాశ్

మర్రిచెట్టుపై పక్షుల్లో కలకలం బయలుదేరింది
కపోతాల ముసుగులేసుకున్న ఖాకులు నాలుగు
గువ్వల ఘోష వినిపించే కోయిల గొంతును కొరికి చంపాయని వార్త
గద్దల గద్దెల పరిరక్షణలో మునిగితేలే ఖాకులు
మొన్న యిక్కడ ఓ ముసలి గద్దను అడివిపిట్టలు చీల్చి చంపాయని
'న్యాయం'గా గొంతెత్తే కోయిల స్వరపేటికను
కసిగా యిప్పుడు చంపేశాయి
అపును —
గుర్తు తెలియని ఆ ఖాకుల గుర్తులు గువ్వలకు తెలుసు
అందుకే అవి మర్రిచెట్టును పెంచి పోషించిన వాళ్ళను ప్రశ్నిస్తున్నాయి—
'గువ్వలకై గొంతువిప్పిన కోయిల చేసిన తప్పేమని?'
అందుకే అవి ఎర్రనిప్పులుగా మారి
ఈ మర్రిచెట్టు కూకటివేళ్ళను పెకలిస్తున్నాయి

# ఇద్దరు నేస్తాల కోసం

— కో. ప్ర.

ఊరు తెలవారకముందే
నీ బతుకు తెల్లారిపోయింది
అయితేనేం
చితిచల్లారకముందే-నీ
స్మృతి మాలో రగుల్కొంది
× × ×
నిను చంపే నాటికి
నిను గురించి వాడి కసలేం తెలియదు
నువ్వు మనిషివని తప్ప
మనుషుల మీద వాడికున్న కసిని
నిను చంపి తీర్చుకొన్నాడు వాడు
అయితేనేం
మనుషుల్ని చంపేవాడు
మృగమని మా కర్థమైపోయింది

(రసూల్, ప్రసాద్‌ల కోసం........)

60 KLVA106M105

136 ARUNATARA MARCH 1992 H/GTR-70

Annual Subscription Rs. 50/- Single Issue Rs. 5/-



అడవి నాది, అడవిపై హక్కు నాది !
పూలు నావి, పళ్లు నావి !
కాయ నాది, కష్టం నాది !
అడగడానికి వీడెవడు ?
ఈ బద్మాష్ పోలీస్ జబర్దస్తీ ఏంది ?

---

## చెల్లీ !

గుడ్డ తక్కువయ్యిందట జాతీయ జెండాకు
చెల్లీ నూ పట్టపగలు నడివీధికి రాకు
స్త్రీల మాన ప్రాణాలకు చిల్లి కాని విలువ
ఇయ్యని ఈ రాజ్యానికి వేద్దామిక శిలువ

— జీవని

Printed at Nagendra Press, VJA-2, on behalf of Venkataramana Printers, Guntur-1 Revolutionary Writers' Association



మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M105 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | |
| మొత్తం పేజీలు | 461 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Jayamma |
| స్కాన్ చేసినది | Priya[illegible] |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |